పంతము { ప్రతి-ఖిలాఫ్.
పందెము-షర్తు.

పంది-సూకరము-సువ్వర్.

పక్కి-పక్షి-పరింద్.

పక్వవారి-గంజి-పీచ్.

పక్షచరుఁడు-చంద్రుఁడు-చాంద్.

పక్షము { ఱెక్క-పర్.
ప్రక్క-బాజూ.

పగ { విరుద్ధము-దుష్మనీ.
విరోధి-దుష్మన్.

పగడము-పవడము-మూంగా.

పగతుఁడు-విరోధి-దుష్మన్.

పగలు-దినము-దిన్.

పగవాఁడు-శత్రువు-దుష్మన్.

పగిడి-లంచము-రుష్వత్.

పగిది { ప్రకారము-తరహ.
లంచము-రుష్వత్.

పచరుఁడు-వంటవాఁడు-బావర్చి.

పచ్చిక-పచ్చిగడ్డి-సబ్జీ.

పచేరణము-మోసము-దగా.

పచ్చకన్నులమెకము-సింహము-షర్జా.

పచ్చడము-దుప్పటి-దుపట్టా.

పచ్చఱెక్కలపిట్ట-చిలుక-తోతా.

పచ్చవారువపుజోదు-సూర్యుఁడు-సూరిజ్.

పటకారుఁడు-నేతకాఁడు-జులాహా.

పటమంటపము—గుడారము—డేరా.

పటము—బట్ట—కప్డా.

పటలము—ఇంటికప్పు—ఛత్.

పటహము—తప్పెట—ఢప్లీ.

పటాణి—అశ్వము—ఘోడా.

పటాలము—సేన—లష్కర్.

పటిమ—ఓర్పు—సబర్.

పటుత్వము—బలము—తాఖత్.

పట్టణము—పెద్దగ్రామము—షహర్.

పట్టము { బిరుదు—ఖితాబ్.
రాజ్యము—రియాసత్.

పట్టి—కొడుకు—బేటా.

పట్టికామంచము—పట్టెమంచము—పలంగ్.

పట్టిపట్టి—మనుమడు—పోతా.

పట్టియము—కత్తి—తల్వార్.

పడంతి
పడంతుక } ఆడుది—ఔరత్.

పడవ—యుద్ధము—లడై.

పడవాలు—సేనాధిపతి—సిపహసాలార్.

పడికట్టు—మర్యాద—మామూల్.

పడిగ—తమ్మలముమిసెడిపాత్ర—ఉగాల్దాన్

పడిసెము—శైత్యరోగము—జొకాం.

పడుక—పఱుపు—బిఛోనా.

పడుకటిల్లు—శయనగృహము—ఖాబ్గాః.

పడుకు—ఱాయి—పత్థర్.

పడుపు—లంజెఱికము—జినాకారీ.

పణము { జూదము—జువ్వా.
వెల—ఖీమత్.
కూలి—మజూరీ.
పందెము—షర్తు.

పణవము—తప్పెట—ఢప్లీ.

పణ్యాంగన—వేశ్య—కంచ్నీ.

పణ్యజీవుఁడు—వ్యాపారి—తాజర్.

పతంగము { పక్షి—పరింద్.
మిడుత—తిడ్డా.
పాదరసము—పారా.
పిల్లి—బిల్లి.
బాణము—తీర్.

పతంగుఁడు—సూర్యుఁడు—సూరిజ్.

పతగము
పతత్తు } పక్షి—పరింద్.

పత్త్రము—ఱెక్క—పర్.

పత్త్రి—పక్షి—పరింద్.

పతనము—పడుట—గిర్నా.

పతాక—టెక్కెము—నిషాన్.

పతాకిని—సైన్యము—జమాఅత్.

పతి—మగఁడు—షోహర్.

పతితము—పాపము—గునహ్.

పతితుఁడు { పడినవాఁడు—గిరాహువా.
పాపాత్ముఁడు—గునహ్‌గార్.

పత్తనము-పట్టణము-షహర్.

పత్తు-నేల-జమీన్.

పత్తి-ప్రత్తి-కపాస్.

పత్ని-పెండ్లాము-జోరూ.

పత్రపరశువు-ఆకుటాయి-సోన్.

పత్రము:
- ఆకు-పత్తా.
- ఱెక్క-పర్.
- బాణము-తీర్.
- చురకత్తి-ఛురీ.

పత్రిక:
- కాగితము-కాగజ్.
- జాబు-ఖత్.
- వృత్తాంతపత్రిక-అఖ్బార్.

పథము, పథి - మార్గము-రాస్తా.

పథికుఁడు-బాటసారి-రాఃరా.

పదంపడి-పిమ్మట-బఅద్.

పదడు:
- భస్మము-రాఖ్.
- చెత్త-కచ్రా.

పదను-సమయము-వఖ్తు.

పదపడి-పదంపడి-బఅద్.

పదము:
- పాదము-కదం.
- శబ్దము-లఫ్జ్.
- స్థానము-జగః.
- కపటము-కీనా.

పదకుఁడు-కాలిబంటు-ప్యాదా.

పదిలము—స్థైర్యము—ఇస్తెక్‌లాల్.
పద్దు—పంతము—షర్తు.
పద్మబాంధవుఁడు—సూర్యుఁడు—సూరిజ్.
పద్మాకరము—కొలను—చష్మా.
పద్మి—ఏనుఁగు—హాతీ.
పద్మినీవల్లభుఁడు—సూర్యుఁడు—సూరిజ్.
పద్య—త్రోవ—రాస్తా.
పనఁటి-కుండ-ఘడా.
పని—వ్యాపారము—కాం.
పనివాఁడు—భృత్యుఁడు—నౌకర్.
పనుపరి—ఆజ్ఞాబద్ధుఁడు—ముతీ.
పన్న—వృద్ధుఁడు—బూఢా.
పన్నీరము—పన్నీరు—గులాబ్కా—పానీ.

పన్నుగడ { యుక్తి—హిక్‌మత్. / ఉపాయము—తద్‌బీర్. }

పబువు—ప్రభువు—మాలిక్.
పయనము—ప్రయాణము—రాహీ.
పయర—చల్లగాలి—థండీహవా.
పయస్యము—పెరుఁగు—దహీ.

పయస్వని { ఆవు—గాయి. / ఏఱు—నద్దీ. }

పయస్సు { పాలు—దూధ్. / నీళ్లు—పానీ. }

పయోధరము—టెంకాయ—నార్యల్.

పయోధి / పయోరాశి } సముద్రము—దర్యా.

పయ్యెర—చల్లనిగాలి—ఠండీహవా.
పరంజము—గానుగ—హల్.
పరంపర—సంతానము—ఔలాద్.
పరంపరుఁడు—మునిమునుమఁడు—పడ్పోతా.
పరటి—పిడక—ఉప్లీ.
పరజాతుఁడు—బానిసవాఁడు—ఖిద్మత్గార్.
పరభృత్తు—కాకి—కవ్వా.
పరమాన్నము—పాయసము—షీర్బిరంజ్.
పరమార్థము—ఆనందము—ఖుషి.
పరాక్రమము / పరాక్రాంతి — శౌర్యము—షుజాఅత్.
పరాగము—దుమ్ము—ధూల్.
పరాచితుఁడు—బానిసవాఁడు—నౌకర్.
పరాజయము—అపజయము—షికస్తు.
పరాభవము / పరాభూతి — అవమానము—బేయిజ్జత్.
పరాయి—ఇతరము—గైర్.
పరార్థవాది—న్యాయవాది—వకీల్.
పరార్థ్యము—శ్రేష్ఠము—ఉమ్దా.
పరాసువు—చచ్చినవాఁడు—ముర్దా.
పరాస్కందీ—చోరుఁడు—చోర్.
పరి—సేన—జమీఅత్.
పరికల్పనము—మోసము—దగా.
పరికిణి / పరికిణీ — పావడ—లంగా.
పరిఖ—అగడ్త—ఖందక్.

పరిఘోషము { ఉరుము—గరజ్ నా.
మ్రోత—ఆవాజ్.

పరిచయము—ఎఱుక—పఛానత్.

పరిచరుడు—భటుడు—ఖిద్మత్ గార్.

పరిచర్య
పరిచారము } సేవ—ఖిద్మత్.

పరిచారకుడు—సేవకుడు—ఖిద్మత్ గార్.

పరిమితి—పరిచయము—పఛానత్.

పరిచ్ఛిత్తి—నిశ్చయము—సచ్.

పరిణయము—పెండ్లి—షాదీ.

పరిణామము { క్షేమము—ఖైరియత్.
ఆనందము—ఖుషి.

పరిణేత—మగడు—షోహర్.

పరితాపము—భయము—డర్.

పరితుష్టి—సంతోషము—ఖుషి.

పరిత్యాగము—విడుపు—తరక్.

పరిపంథి
పరిపంథుడు } శత్రువు—దుష్మన్.
పరిపథకుడు

పరిపోషకుడు—పోషించెడివాడు—మహాఫిజ్.

పరిభవము—అవమానము—బేయిజ్జత్.

పరిమళము—సువాసన—ఖుష్‌బో.

పరిమితి—పరిమాణము—హద్.

పరిమోషము—దొంగతనము—చోరీ.

పరిమోషి—దొంగ—చోర్.

పరియాచకము—హాస్యము—ఠట్టా.

పరియు { తప్పు—కుసూర్.
చెడు—బద్.

పరివసథము—గ్రామము—దేః.

పరిచర్య—సేవ—ఖిద్మత్.

పరిశీలనము—శోధనము—తహ్కీక్.

పరిశ్రమము—అలవాటు—ఆదత్.

పరిషత్తు—సభ—మజ్లిస్.

పరిసరము { సమీపము—కరీబ్.
చాపు—తూత్.

పరిహాసనము } హాస్యము—థట్టా.
పరీహాసము }

పరీక్ష—పరిశీలనము—ఇమ్తెహాన్.

పరీక్షకుఁడు—పరిశీలించువాఁడు—ముమ్తెహిన్

పరుఁడు { అన్యుఁడు—గైర్.
శత్రువు—దుష్మన్.

పరుటు—కుండ—ఘుడా.

పరువము—వయస్సు—ఉమర్.

పరుషము } కఠినవాక్యము—సఖ్తుకలాం.
పరుసు }

పర్ణము—ఆకు—పత్తా.

పర్యంకము—మంచము—పలంగ్.

పర్యంతము—దనుక—తక్.

పర్యవసానము—ముగియుక—అన్జాం.

పర్యాప్తము—తృప్తి—ఖినాఅత్.

పర్యుదంచనము—ఋణము—కరజ్.

పర్యుషితము—చేలిది—తోషా.

పర్వతము–అద్రి–పహాడ్.

పర్వము–పండుగ–ఈద్.

పఙ్తి–విధము–తరః.

పలకము–మంచము–పలంగ్.

పలము { మాంసము–గోష్తు.<br>బురద–కీచడ్.

పలాలము–గడ్డి–ఘాఁస్.

పలాశము–ఆఁకు–పత్తా.

పలితము { బురద–కీచడ్.<br>వెంట్రుక–బాల్.

పలువ–దుష్టుఁడు–బద్‌నఫ్స్.

పలువలువ<br>పల్వాల్వ } పెదవి–హోఁట్.

పల్యంకము–మంచము–పలంగ్.

పల్యంకిక–పల్లకి–పాల్కీ.

పల్లవము–చిగురు–చుగుర్.

పల్లి { గుడిసె–ఝోంప్డీ.<br>పల్లె–ఖేడా.<br>బల్లి–సిప్‌లక్.

పవమానుఁడు<br>పవము } గాలి–హవా.

పవిత్రము { జందెము–జేన్వార్.<br>నీళ్లు–పానీ.<br>రాగి–తాంబా.<br>పరిశుద్ధము–పాక్.

పవిది–పగిది–తరః.

పస—స్వారస్యము—లుత్ఫ్.

పసరము } ప్రసాదము—ఖానా.
పసాదము }

పసాదము } మకాణము—దూకాన్.
పసాను }

పసిఁడి { బంగారు—సూనా.
{ ధనము—దౌలత్.

పసితనము—బాల్యము—బచ్పనా.

పసితిండి—వ్యాఘ్రము—పులి.

పసిపాప—చిన్నబిడ్డ—బచ్చా.

పస్త్యము—ఇల్లు—మకాన్.

పస్తు—వుపవాసము—ఫాకా.

పాంచజన్యుఁడు—అగ్ని—అంగార్.

పాంథుఁడు—బాటసారి—రాఃగా.

పాంశువు { దుమ్ము—ధూల్.
{ ఎరువు—ఖాద్.

పాంసుల { అంకుటాలు—ఫాహాషా.
{ భూమి—జమీన్.

పాంసువు—దుమ్ము—ధూల్.

పాశికుఁడు—పిట్టలంబట్టెడువాఁడు—షికారీ.

పాఁతఱ { ధాన్యముంచెడిచోటు—గోదాం.
{ నిధి—ఖజానా.

పాతచికము { పరిచయము—పహచానత్.
{ పాఁతది—పురానా.

పాఁపమేపరి } నెమలి—మోర్.
పాఁపమేపుడు }

పాకగేహము—వంటయిల్లు—బావర్చీఖానా.

పాకలము { గుఱ్ఱము–ఘోడా.
గాలి–హావా.
నిప్పు–అంగార్.

పాకాగారము–వంటయిల్లు–బావర్చీఖానా.

పాగ { తలకట్టు–దస్తార్.
గుఱ్ఱపుశాల–అస్తబల్.

పాగా–అశ్వశాల–అస్తబల్.

పాచేనము–విరేచనము–బరాజే.

పాట–పదము–గీత్.

పాటకాఁడు–పాటపాడువాఁడు–గవయ్యా.

పాటచ్చరుఁడు–దొంగ–చోర్.

పాటి { సామ్యము–మిసాల్.
న్యాయము–ఇన్సాఫ్.
సమము–బరాబరీ.

పాటీరము { వరిమడి–ధన్‌మడీ.
చందనము–సందల్.

పాణింధమము–చీఁకటి–అంధేరా.

పాణిక–గరిటె–డోయీ.

పాణికుఁడు–వర్తకుఁడు–తాజర్.

పాణిగ్రహణము–పెండ్లి–షాదీ.

పాణిరుహము–గోరు–నాఖూన్.

పాణీకృతి–పెండ్లి–షాదీ.

పాతకము–పాపము–గునః.

పాత్రి–కుండ–ఘడా.

పాథస్సు { జలము–పానీ.
అన్నము–ఖానా.

పాథేయము-దారిబత్తెము-తోషా.

పాథోధి
పాథోనిధి } సముద్రము-దర్యా.

పాదకటకము-అందియ-ఘుంగ్రూ.

పాదప
పాదపము } చెట్టు-ఝాడ్.

పాదబంధనము-పశువు-హైవాన్.

పాదరసము-రసము-పారా.

పాదరక్షలు-ముచ్చెలు-పాపోష్.

పాదాంగదము-అందియ-ఘుంగ్రూ.

పాదుక
పాదుకము } ముచ్చె-జూతా.
పాదువు

పానీయము-నీళ్లు-పానీ.

పానుపుమంచము-పలంగ్.

పాన్పు-పఱపు-బిఛోనా.

పాపఁడు-బాలుఁడు-బచ్చా.

పాపకుఁడు-దుర్మార్గుఁడు-బద్ నప్సు.

పాపము-దోషము-గునః.

పాపాత్ముఁడు-పాపి-గునఃగార్.

పాపాలముద్ద-దుష్టుఁడు-బద్ నఫ్సు.

పాపి-పాపముగలవాఁడు-గునఃగార్.

పాపోసు-ముచ్చె-జూతా.

పాప్మము-పాపము-గునః.

పామ
పామము } గజ్జి—ఖారిష్.

పామఘ్నము—గంధకము—గంధక్.

పామరము—బుద్ధిలేమి—బేఅక్లీ.

పారదేసికుఁడు { అన్యదేశస్థుఁడు—గైర్ ముల్కీ.
బాటసారి—రాఃరౌ.

పారసి—కంసాలి—సునార్.

పారాపతము
పారావతము } పావురము—కబూతర్.

పారావారము—సముద్రము—దర్యా.

పారి { సారి—దఫా.
మన్ను—మిట్టీ.

పారిక—దాసి—బాందీ.

పారికాఁపు
పారివాఁడు } పరిచరుఁడు—ఖిద్మత్ గార్.

పారీంద్రము—సింహము—షర్జా.

పారీణుఁడు—పారముట్టినవాఁడు—కామ్యాబ్.

పారుపత్తెకాఁడు—అధికారి—హాకిం.

పారువ { జోడు—పతా.
దృష్టి—నజర్.

పారువము—పావురము—కబూతర్.

పారుష్యము—కఠినఁపుమాట—సఖ్తుకలాం.

పార్థివ
పార్థివము } గుఱ్ఱము—ఘోడా.

పార్థివుఁడు
పార్థుఁడు } రాజు—బాదుషా.

పారావతము—పావురము—కబూతర్.

పార్శ్వము { సమీపము—కరీబ్.
ప్రక్క—తరఫ్.

పాఱుఁడు—బ్రాహ్మణుఁడు—బొమ్మన్.

పాఱుఁబోఁతు—పిఱికి—బేహిమ్మత్.

పాఱుటక్క—బాపనమ్మ—బొమ్మన్నీ.

పాలకడలివెన్న—చంద్రుఁడు—చాంద్.

పాలకి }
పాలకీ } పల్లకి—పాల్కి.

పాలకుఁడు—రక్షకుఁడు—మహాఫిజ్.

పాలనము—రక్షణము—హిఫాజేత్.

పాలమన్ను—తెల్లమన్ను—సుఫేద్ మిట్టి.

పాలసుఁడు { దుర్మార్గుఁడు—బద్ నఫ్సు.
మూర్ఖుఁడు—జాహిల్.

పాలికాఁపు
పాలిచుట్టము } భాగస్థుఁడు—హిస్సేదార్.
పాలివాఁడు

పాలు { భాగము—హిస్సా.
సమీపము—కరీబ్.
వశము—ఇమ్కాన్.
వంతు—బారి.

పాల్మాలిక—పాలుమాలిక—తకాన్.

పావంచే—మెట్టు—సిఢీ.

మంచినడవడికలవాఁడు—నేక్ నఫ్సు.
పావకుఁడు { సూర్యుఁడు—సూరిజ్.
అగ్ని—అంగార్.

పావడ—వస్త్రము—కప్డా.

పావడము—కానుక—తొహఫా.

పావనము { నీళ్లు—పానీ.
స్వచ్ఛమైన—పాక్.

పావని { ఆవు—గాయి.
పవిత్రురాలు—పార్సాఔరత్.

పావు—నాల్గవభాగము—చౌథాహిస్సా.

పావురము
పావురాయి } పారావతము—కబూతర్.

పాశము—త్రాడు—రశ్శీ.

పాషాణదారకుడు—కాసెవాడు—సంగ్‌తరాష్.

పాషాణము { రాయి—పత్థర్.
విషము—జేహర్.

పాసెము—పరమాన్నము—ఖీర్‌బిరంజ్.

పాళము—సమయము—వఖ్తు.

పాళి { గురుతు—నిషాణ్.
చోటు—జగః.
అంచు—కినారా.
వరుస—కతార్.

పాళీ
పాళీలు } జూదము—జువ్వా.

పాళెము { కావలి—పహారా.
దండు—జమీఅత్.

పింగ—ఇంగువ—హీంగ్.

పింగళ { కోతి—బందర్.
ముంగిస—నేవల్.

పింగళుఁడు—అగ్గి—అంగార్.

పించెము { మదము—మస్తీ.
గర్వము—గురూరీ.

పింజ { హింస—ఈజా.
దూది—రూయీ.
పసుపు—హల్దీ.

పింజము { బలము—తాఖత్.
హింస—ఈజా.

పింజరము—బంగారము—సూనా.

పింజేనక్రోవి—చిమ్మనక్రోవి—పిచ్ కారీ.

పింజారి—దూదేకువాఁడు—లద్దాఫ్.

పిండము { శరీరము—జిసం.
గర్భము—హామల్.
చెండు—గేంద్.
ఇనుము—లోహా.
బలము—తాఖత్.

పిండి—పిష్టము—ఆటా.

పిండు—చెండు—గేంద్.

పికవర్ధనము—కాకి—కవ్వా.

పిక్కు—వంచన—ధోకా.

పిచండము { కడుపు—పేట్.
పఱుపు—బిఛోనా.

పిచిండము—కడుపు—పేట్.

పిచువు—దూది—రూయీ.

పిచ్ఛటము—తగరము—కథీల్.

పిచ్చి—తిక్క—జునూనీ.

పిచ్చిక—పిచ్చుక—చిడ్యా.

పిచ్చికకుంటు—కాళ్లులేనివాఁడు—లంగ్డా.

పిచ్చివాఁడు—తిక్కవాఁడు—దివానా.

పిచ్చెపట్టు—లుబ్ధత్వము—బౌఖాలత్.

పిచ్చెపాటి—సుఖదుఃఖములు—రంజో, రాహత్.

పిచ్చుక—పిచ్చిక—చిడ్యా.

పిటకము { గంప—టోక్రా.
పుండు—ఫోడా. }

పిట్టము—గంప—టోక్రా.

పిట—పక్షి—పరింద్.

పిఠరము—కవ్వము—రవీ.

పిడి—కత్తిపిడి—కబ్జా.

పిడుక—ఎండపెట్టిన పేడముద్ద—ఉప్లీ.

పిడుగు<br>పిడ్గు } అశని—బిజ్లి.

పిడుత—చిన్నముంత—మట్కి.

పిణ్యాకము—గాన్గబిండి—ఖల్లి.

పిత<br>పితరుఁడు } తండ్రి—బాప్.

పితలాటకము—మోసము—దగా.

పితామహి—అవ్వ—దాదీ.

పితామహుఁడు—తాఁత—దాదా.

పితృవనము—స్మశానము—ఖబ్రస్తాన్.

పిత్తలము<br>పిత్తళి } ఇత్తడి—పీతల్.

పిత్ర్యము—తండ్రిది—పిదరీ.

పిత్సంతము—పక్షి—పరింద్.

పిత్సలము—దారి—రాస్తా.

పిదప { తరువాత—బఅద్.<br>వెనుక—పీఛే.

పిన—చిన్న—ఛోటా.

పినతండ్రి—తండ్రితమ్ముఁడు—చచా.

పినుఁగు { లుబ్ధకుఁడు—షికారీ.<br>లోభి—బఖీల్.

పిన్న—చిన్న—ఛోటా.

పిన్నపాక—కన్యక—లడ్కీ.

పిన్నయ్య—తండ్రితమ్ముఁడు—చచా.

పిన్నఱికము—చిన్నతనము—బచ్పనా.

పిపాస—దప్పి—ప్యాస్.

పిపాసితుఁడు—దప్పిగొన్నవాఁడు—ప్యాసా.

పిపీలిక<br>పిపీలి } చీమ—చుంటి.

పిప్పల—బాతు—బతఖ్.

పిప్పల<br>పిప్పలము } నీళ్లు—పానీ.

పిప్పలాశనము—ఏనుఁగు—హాతీ.

పిమ్మట—పిదప—బఅద్.

పిరంగి<br>పిరంగీ } నేలపైఁబెట్టికాల్చెడి పెద్దతుపాకి—తోప్.

పిఱికి—భయపడెడివాఁడు—బేహిమ్మత్.

పిఱికి మెకము—జింక—హారణ్.

పిఱిది }
పిఱు } వెనుక—పీఛే.

పిఱుము—పరుషభాషణము—సఖ్తుకలాం.

పిలుకు—గర్వము—గురూరీ.

పిల్ల—చిన్న—ఛోటా.

పిల్లకాయ }
పిల్లగాఁడు } బాలుఁడు—లడ్కా.

పిల్లలు—బిడ్డలు—లడ్కే.

పిల్లి—మార్జాలము—బిల్లి.

పిల్లు—గడ్డి—ఘాఁస్.

పిశాచము—పిల్లి—బిల్లి.

పిశిత }
పిశితము } మాంసము—గోష్తు.

పిశునము—కాకి—కవ్వా.

పిశునుఁడు { కొండీఁడు—చుగుల్ ఖోర్.
{ దుష్టుఁడు—బద్ నప్సు.

పిష్టకము—నూఁబిండి—తిల్ కాఆటా.

పిష్టము—పిండి—ఆటా.

పిస—అవివేకము—బేఅక్ లీ.

పిసరు { తునుక—తుక్ డా.
{ లేశము—కొంచెము.

పినాళము—పరిహాసము—థట్టా.

పిసాళి—మూఢుఁడు—బేవకూఫ్.

పిసినిపురుగు—లోభి—బఖీల్.

పీఁకు—పెఱుకుట—ఖీఁచ్ నా.

పీఁకె—ఆకుచుట్ట—పత్తేకాచుట్టా.

పీఁచేము { మదము—మస్తీ.
గర్వము—గురూరి.

పీఁట—కూర్చుండెడిపలకపీఁట—తఖ్తు.

పీచము—గడ్డము—దాఢీ.

పీఠము }
పీఠి } ఆసనము—తఖ్తు.

పీఠిక—పుస్తకము మొదట వ్రాసెడిసంగతి=దీబాచా.

పీడ { బాధ—తకలీఫ్.
దయ—మెహరబానీ.

పీత { ఎండ్రకాయ—కేచ్వా.
పసుపు—హల్దీ.

పీతనము—కుంకుమపువ్వు—జాఫ్రాన్.

పీతము—ఎండ్రకాయ—కేచ్వా.

పీతి }
పీథి } గుఱ్ఱము—ఘోడా.

పీనము—ఆనందము—ఖుషి.

పీనసము—పడిసెము—జోకాం.

పీనస్కంధము—పంది—సువ్వర్.

పీనుఁగు—శవము—లాష్.

పీనుఁగుఁదిండి—పిశాచము—షైతాన్.

పీన్గు—శవము—లాష్.

పీయువు { కాకి—కవ్వా.
నిప్పు—అంగార్.
కాలము—వఖ్తు.
బంగారు—సూనా.

పీల—కృశము—లాగరీ.

పీలుకము { పక్షిపిల్ల—పరిందాకాబచ్చా.
చీమ—చుంటీ.

పీలువు { ఏనుఁగు—హాతీ.
పువ్వు—ఫూల్.
బాణము—తీర్.

పీవరము—తాఁబేలు—కఛ్వా.

పుంగవము—ఎద్దు—బైల్.

పుంజి—సమృద్ధి—కాఫీ.

పుంజు—కోడిపుంజు—ముర్గా.

పుండరీకము { పులి—షేర్.
కప్ప—మేండుక్.

పుండు—వ్రణము—ఫోడా.

పుండ్రము—పురుగు—కీడా.

పుంశ్చలి—అంకుటాలు—ఫాహిషా.

పుంసవనము—క్షీరము—దూధ్.

పుక్కసుఁడు { చండాలుఁడు—ధేడ్.
అధముఁడు—కమీనా.

పుచ్చె—తలపుర్రె—ఖోప్రీ.

పుచ్చుకొనె—తీసికొనె—లియా.

పుచ్ఛము—తోఁక—దుం.

పుటపుటన—అధికము—జియాదా.

పుటభేదము } పట్టణము—షహర్.
పుటభేదనము }

పుటము—దొన్నె—దోనీ.

పుటిక } చిన్నగంప—టోక్రీ.
పుట్టిక }

పుట్టకాఁపు } గుడ్లెలుఁగు—రీచ్.
పుట్టకూడుదిండి }

పుట్టచెండు—బంతి—గేంద్.

పుట్టదిట్టు—పాము—సాంఫ్.

పుట్టము—వస్త్రము—కప్డా.

పుట్టి { పుట్టెడు—ఖండీ.
ఏటుదాటెడిపెద్దగంప—టోక్రా.

పుట్టిక—చిన్నగంప—టోక్రీ.

పుట్టుమూఁగ—పుట్టుమూఁగ—గుంగామాదర్ జాద్.

పుడమి—భూమి—జమీన్.

పుడమితాలుపు { రాజు—బాదుషా.
పర్వతము—పహాడ్.

పుడమిపుట్టు—చెట్టు—ఝాడ్.

పుడమిఱేఁడు—రాజు—బాదుషా.

పుడమివేలుపు—బ్రాహ్మణుఁడు—బ్రామ్హణ్.

పుడమీశుఁడు—రాజు—బాదుషా.

పుణ్యము—సుకృతము—సవాబ్.

పుత్తడి { బంగారు—సూనా.
బొమ్మ—పుత్లా.

పుత్తళి—బొమ్మ—పుత్లా.

పుత్రిక—కూఁతురు—బేటీ.

పుత్రుఁడు—కొమారుఁడు—బేటా.

పునర్నవము } గోరు—నాఖూన్.
పునర్భవము }

పునాది—ఇంటిబలమునకై మొదలుత్రవ్వి పెట్టినగోడ — బున్యాద్.

పుణ్యము—పుణ్యము—సవాబ్.

పునుఁగుపిల్లి—సువాసనగల పిల్లి—మిష్కబిల్లి.

పునుక
పుర్క } కపాలము—ఖోప్రీ.

పుష్పము—పువ్వు—ఫూల్.

పుమాంసుఁడు—మనుష్యుఁడు—ఇన్సాన్.

పుయిలోటు
పుయిలోటము } సందియము—షక్.
సిగ్గు—షరం.

పురంధ్రి—ఆఁడుది—ఔరత్.

పురము { పట్టణము—షహార్.
శరీరము—జిసం.
ఇల్లు—ఘర్.

పురస్కారము—సన్మానము—ఇజ్జత్.

పురాణము
పురాతనము } ప్రాఁతది—పురానా.

పురావృత్తము—కథ—హికాయత్.

పురి { పట్టణము—షహార్.
గర్వము—గురూర్.

పురిపిట్ట
పురిపులుఁగు } నెమిలి—మోర్.

పురీతత్తు—ప్రేఁగు—అంత్డి.

పురుగు—కీటము—కీడా.

పురుటియాలు
పురుటాలు } బాలెంత—జెచా.

పురువు } పురుగు—కీడా.
పుర్వు }

పురుషుఁడు—మనుష్యుఁడు—ఇన్సాన్.

పురోగముఁడు—ముందునడచువాఁడు—పేష్ రౌ.

పురోభాగి—తప్పులు బట్టెడివాఁడు—నుక్తచీన్.

పుర్వు—పురుగు—కీడా.

పుఱియ }
పుఱ్ఱియ } పుఱ్ఱె—ఖోప్రీ.
పుఱ్ఱె }

పులకము—పులగము—ఖిచ్ డీ.

పులకరము—జ్వరము—బొఖార్.

పులఖండము—కలకండ—మిస్రీ.

పులసరము—అజీర్ణము—బద్ హాజ్మా.

పులసరి—గర్వపడెడివాఁడు—మగ్రూర్.

పులసరితనము—గర్వము—గురూర్.

పులాకము { సంక్షేపము—ఖులాసా.
{ గంజి—పీచ్.

పులి—వ్యాఘ్రము—షేర్.

పులియ—విస్తరాకు—పత్రోడీ.

పులు—కసవు—ఘాఁస్.

పులుఁగు—పిట్ట—పరింద్.

పులుఁగుపిట్ట—గుడ్లగూబ—ఉల్లూ

పుల్కసుఁడు—మాలవాఁడు—ఢేడ్.

పుల్కశుఁడు—తక్కువవాఁడు—రజీల్.

పుల్గము—పులగము—ఖిచ్ డీ.

పుల్లదానిమ్మ–ఆమ్లదాడిమము–ఖట్టాఅనార్.

పుల్లన–పులుసు–ఖట్టా.

పుల్లియ / పుల్లై – విస్తరాకు–పత్రోడీ.

పులుసు–ఆమ్లము–ఖట్టా.

పుల్లు { గడ్డి–ఘాఁస్.<br>కొంచెము–థోడా.

పుల్లై–విస్తరాకు–పత్రోడీ.

పువు–పుష్పము–ఫూల్.

పువుఁబోఁడి–ఆఁడుది–ఔరత్.

పువ్వు–పుష్పము–ఫూల్.

పుష్కరము { ఆకాశము–ఆస్మాఁ.<br>నీళ్లు–పానీ.<br>బాణము–తీర్.<br>యుద్ధము–లడై.<br>పంజరము–పింజ్రా.

పుష్కరిణి { కోనేఱు–చష్మా.<br>ఆఁడేనుఁగు–హాత్నీ.

పుష్కలము { చాలా–జియాదా.<br>సమృద్ధి–కాఫీ.

పుష్టి { బలము–తాఖత్.<br>సమృద్ధి–కాఫీ.

పుష్పకము { కుంపటి–అంగేటీ.<br>పుష్పము–ఫూల్.

పుష్పఫలము–కపిత్థము–కవీట్.

పుష్పము—పువ్వు—ఫూల్.

పుష్పవంతులు—సూర్యచంద్రులు—సూరజ్,చాంద్.

పుస్తకము<br>పుస్తము } గ్రంథము—కితాబ్.

పుస్తి—సహాయము—మదద్.

పుస్తు—చెడ్డవాసన—బద్ బో.

పూ—పువ్వు—ఫూల్.

పూచు—పూను—ఆమాదా.

పూట { కాలము—వఖ్తు.<br>దినము—దిన్.

పూటకూళ్ళమ్మ—వంటకూలిది—భట్యారీ.

పూజ్యుడు—మామ—మామూ.

పూటము—బరువు—బోఝ్.

పూడుపు—నిక్షేపము—దఫీనా.

పూతిగంధము<br>పూతిగంధి } దుర్గంధము—బద్ బో.

పూనిక<br>పూనికి } కోరిక—ఖాహిష్.

పూయము { శవము—లాష్.<br>జోదము—జువ్వా.

పూరకుడు—నించెడివాడు—భర్నేవాలా.

పూరి—గడ్డి—ఘాస్.

పూరిక—బూరె—పూరీ.

పూరుషుడు—మనుష్యుడు—ఆద్మీ.

పూర్ణము—అంతా—సబ్.

పూర్ణిమ-పున్నమ-చాంద్ రాత్.

పూర్వజుఁడు-అన్న-బడాభాయి.

పూర్వపక్షము-వాదము-బహస్.

పూర్వము-మొదటిది-పహిలా.

పూలము-గడ్డికట్ట-ఫూలా.

పూవు-పువ్వు-ఫూల్.

పృచ్ఛ-ప్రశ్నము-సవాల్.

పృతన-సేన-జమీఅత్.

పృథగ్జనుఁడు { పాతకుఁడు-గునఃగార్. / నీచుఁడు-రజీల్. / మూర్ఖుఁడు-జాహిల్. }

పృథివి-భూమి-జమీన్.

పృథివిపతి-రాజు-బాదుషా.

పృథుకము-పిల్ల-బచ్చా.

పృథురోమము-మచ్ఛము-మఛ్ఛీ.

పృథువు { అగ్గి-అంగార్. / గొప్పది-బడా. }

పృథ్వి-నేల-జమీన్.

పృదాకువు { తేలు-బిచ్చూ. / పాము-సాఁప్. / పులి-షేర్. }

పృదకువు-పులి-షేర్.

పృషతము-దుప్పి-చీతల్.

పృషత్కము-బాణము-తీర్.

పృషత్తు-దుప్పి-చీతల్.

పృషదంశకము-పిల్లి-బిల్లి.

పృషదశ్వుఁడు-గాలి-హవా.

పృష్ఠము-వీఁపు-పీట్.

పెంకె-మూర్ఖుఁడు-జాహిల్.

పెంట-ఎరువుదిబ్బ-ఘూడ్.

పెండ-పేఁడ-గోబర్.

పెండిలి-పెండ్లి-షాదీ.

పెండ్లము-
పెండ్లాము- } భార్య-జోరూ.

పెండ్లి-వివాహము-షాదీ.

పెండ్లికూఁతురు-వధువు-దుల్హన్.

పెండ్లికొడుకు-వరుఁడు-దూలా.

పెందెరువు-రాజమార్గము-షాహ్‌రాహ్.

పెంపు {
సమృద్ధి-కాఫీ.
అతిశయము-జియాదా.
గౌరవము-ఇజ్జత్.
వృద్ధి-తరక్కీ.
}

పెంపుడు-నడిపినది-పాల్తూ.

పెక్కు-అనేకము-బహుత్.

పెక్కురు-అనేకులు-బహుత్ లోగ్.

పెచ్చోరి-మూర్ఖుఁడు-జాహిల్.

పెటుకు-విరసము-బేలుత్ఫ్.

పెట్టుడు-త్యాగము-సఖావత్.

పెట్టె-పేటిక-సందూఖ్.

పెడ-పెద్ద-బడా.

పెడకట్టె } మూర్ఖుఁడు—జాహిల్.
పెడసరకట్టె }

పెడసరము—మూర్ఖము—జహాలత్.

పెత్తనగాఁడు—అధికారి—మాలిక్.

పెత్తనము—అధికారము—ఎఖ్తియార్.

పెద—పెద్ద—బడా.

పెదవి—అధరము—హోఁట్.

పెద్ద { వృద్ధుఁడు—బూఢా.
{ అధికము—జియాదా.

పెద్దకాఁపు—గ్రామాధికారి—పటేల్.

పెద్దతనము—ముసలితనము—బుఢాపా.

పెద్దనిదుర. } చావు—మాత్.
పెద్దనిద్దుర— }

పెద్దపులి—వ్యాఘ్రము—షేర్.

పెద్దమనుష్యుఁడు { గొప్పవాఁడు—ఆలా.
{ వృద్ధుఁడు—బూఢా.

పెద్దఱికము—పెద్దతనము—బుజేర్గీ.

పెనఁకువ { యుద్ధము—లఢాై.
{ వివాదము—బహస్.

పెనఘు—వివాదము—బహస్.

పెనిమిటి—మగఁడు—షౌహర్.

పెను—పెద్ద—బడా.

పెనుపు { వృద్ధి—తరక్కీ.
{ ఆధిక్యము—జియాధా.

పెర { తేనెతెట్టె—మహద్‌కాఛత్తా.
{ అన్యము—గైర్.

పెరసు-మాంసము-గోష్తు.

పెరము-ప్రేమ-మొహబ్బత్.

పెరిమ-ప్రియము-ఉల్ఫత్.

పెరుఁగుడు-వృద్ధి-తరక్కీ.

పెఱ-అన్యము-గైర్.

పెఱగాయ-కొండీఁడు-చుగల్‌ఖోర్.

పెలుచ { మిక్కిలి-బహుత్.
కాఠిన్యము-సఖ్తు.
ఆగ్రహము-గుస్సా. }

పెల్లు-అధికము-జియాదా.

పెసలు-ధాన్యవిశేషము-మూంగ్.

పెళుచు { మూర్ఖుఁడు-జాహిల్.
విరసము-బేలుత్ఫ్. }

పేఁట-నగరము-షహర్.

పేఁడ-పెండ-గోబర్.

పేగు-ప్రేఁగు-అంత్డీ.

పేచకము-పెద్దపిట్ట-ఉల్లూ.

పేచకి-ఏనుఁగు-హాతీ.

పేటి-పెట్టె-పిటారా.

పేడి-నపుంసకుఁడు-హింజ్డా.

పేద { బంటు-ప్యాదా.
దరిద్రుఁడు-గరీబ్.
అశక్తుఁడు-లాచార్. }

పేదఱికము }
పేదఱిమి } బీదతనము-గరీబీ.

పేయము
నీళ్లు—పానీ.
పాలు—షీర్.
గంజి—పీచ్.

పేరడవి—గొప్పయడవి—బియాబా౯.

పేరణి—అంగి—అంగ్రబా.

పేరిమి
గౌరవము—ఇజ్జత్.
అతిశయము—జియాదా.
ప్రేమ—మొహబ్బత్.

పేరివము—శైత్యము—సర్ది.

పేరు
నామము—నాం.
కీర్తి—నేక్‌నామీ.
దండ—హార్.
పెద్ద—బడా.
అధికము—జియాదా

పేలలు—పేలాలు—ఖీలీ.

పేశలము
రోకలి—మూసల్.
సుందరి—హాశీనా.

పేశి
అండము—అండా.
మొగ్గ—కలీ.

పేశీకోశము—అండము—అండా.

పైడి
పయిఁడి
ధనము—దౌలత్.
బంగారము—సూనా.

పైడిచూలాలు—నేల—జెమీ౯.

పైకము
పయికము
ధనము—దౌలత్.

పైజోడు } పాదరక్ష—జూతా.
పయిజోడు }

పైడాలము—కోపము—గుస్సా.

పైత్యము—పిచ్చి—జునూనీ.

పైద } పిల్లవాఁడు—లడ్కా.
పయిద }

పైదలి } ఆఁడుది—ఔరత్.
పయిదలి }

పైనము } ప్రయాణము—సఫర్.
పయినము }

పైవెచ్చు—ఆధిక్యము—జియాదతీ.

పైర } చేను—ఖేత్.
పయిర }

పైరము—ఆవు—గాయి.

పైరు—సస్యము—ఖేత్.

పొన్—బంగారము—సూనా.

పొంకణాలము—సంచి—థైలి.

పొంకము } సౌందర్యము—ఖూబ్ సూరతీ.
పొంకాయింపు }

పొంగలి—పులగము—ఖిచ్ డీ.

పొంగు { సంతసము—ఖుషీ.
పొంగు { గర్వము—గురూరీ.

పొంటె { నిమిత్తము—వజః.
పొంటె { కొఱకు—వాస్తే.

పొంత { దగ్గర–కరీబ్.
దారి–రస్తా.
బడ్డు–కినారా. }

పొంతకత్తె–కుంటెనకత్తె–కుట్నీ.

పొంతము–మైత్రి–దోస్తీ.

పొందిక–సహవాసము–సొహబత్.

పొందు–స్నేహము–దోస్తి.

పొందుకాఁడు–మిత్రుఁడు–దోస్తు.

పొక్క { గుఱుతు–నిషాణ.
ఉపాయము–తద్బీర్. }

పొక్కిలి { బొడ్డు–నాఫ్.
గుంట–గఢా. }

పొగ–ధూమము–ధుఁవాఁ.

పొగడిక–స్తోత్రము–తారీఫ్.

పొగడిత } కీర్తి–నేక్‌నామీ.
పొగడ్త } స్తుతి–తారీఫ్.

పొగరు–గర్వము–గురూరీ.

పొగరుఁబోతు–గర్వశీలుఁడు–మగ్రూర్.

పొగాకు–ధూమ్రపత్రము–తంబాకు.

పొచ్చెము { తక్కువ–కమీ.
కపటము–కీనా.
మోసము–దగా. }

పొటిపొటి–అల్పము–థోడా.

పొట్లలు–పొట్లలు–పోట్లా.

పొట్ట–కడుపు–పేట్.

పొట్టక్రొవ్వు-గర్వము-గురూరీ.

పొట్టము-కౌపీనము-లంగోటీ.

పొట్టియ-తేలు-బిచ్చూ.

పొట్టివాఁడు-వామనుఁడు-గిడ్డా.

పొట్టేలు-పొటేలు-పోట్లా.

పొట్లము-మడుపు-పుడ్యా.

పొడ-రూపు-సూరత్.

పొడలమెకము-దుప్పి-చీతల్.

పొడవు-రూపు-సూరత్.

పొడుపు-ఉదయము-సుబః.

పొడువ } దుర్జనుఁడు-బద్ నఫ్స.
పొడువఁడు }

పొడువు-ఎత్తు-ఊంచా.

పొడ్మ-పొడము-నాస్.

పొత్తము-పుస్తకము-కితాబ్.

పొత్తిక-మెత్తని-నరం.

పొత్తు { మైత్రి-దోస్తీ.
{ అవిభక్తత-ముష్తరికా.

పొత్తులాఁడు-మిత్రుఁడు-దోస్తు.

పొత్తుటాలు-బోగముది-కంచ్నీ.

పొదడు-పొట్టివాఁడు-గిడ్డా.

పొది-పొదుఁగు-కాస్.

పొదుపు-వృద్ధి-తరక్కీ.

పొద్దు-ప్రొద్దు-వఖ్తు.

పొనుపు-పరాక్రమము-షుజాఅత్.

పొన్ను-బంగారము-సూనా.

పొయి / పొయ్యి } పొయ్యి-చూలః.

పొరపాటు-ప్రమాదము-గలత్ ఫహమీ.

పొరపు-భేదము-ఫరక్.

పొరి-మిక్కిలి-బహుత్.

పొరుగు-ప్రక్క-బాజూ.

పొల-మాంసము-గోష్టు.

పొలతి / పొలతుక } ఆడుది-ఔరత్.

పొలకువ-జోడ-పతా.

పొలపము-వాసన-బో.

పొలపరి-దొంగ-చోర్.

పొలము { పైరునేల-జమీనెకాష్త.
అడవి-జంగల్.
విధము-తరః.
జోడ-పతా.

పొలసు-మాంసము-గోష్టు.

పొలి { నష్టి-నక్ సాఁ.
బలి-కుర్బానీ.
లాభము-నఫా.
మేలు-నేకీ.
వ్యర్థము-పుజోల్.

పొలికలను-యుద్ధభూమి-జంగ్ గాః.

పొలిమేర-రెండుగ్రామములమధ్యస్థలము-సర్ హద్.

పొలివోయె { చచ్చె-మరా.
చెడె-బిగ్డా.

పొలుపు
పొల్పు { ప్రకారము-తరః.
జాడ-పతా.
స్థైర్యము-ఇస్తిక్‌లాలీ

పొల్తి
పొల్తుక } ఆఁడుది-ఔరత్.

పొల { వ్యర్థము-ఫుజూల్.
బొంకు-హీలా.

పొల్లు-వ్యర్థము-ఫుజూల్.

పొవరు-పొగరు-గురూరీ.

పొసపొస-త్వరగా-జల్దీ.

పో-పొమ్ము-జావొ.

పోఁక-వక్క-శుప్యారి.

పోఁడిమి { సౌఖ్యము-ఆరాం.
సంపద-దౌలత్.

పోకిరి-గర్వముగలవాఁడు-మగ్రూర్.

పోకు-నడవడి-చాల్.

పోటుముంజి-గోఁచి-లంగోటీ.

పోటరి-శూరుఁడు-షుజా.

పోటు { సమరము-లడై.
బాధ-తక్లీఫ్.
శౌర్యము-షుజాఅత్.

పోటుకాఁడు
పోటుబంటు
పోటుమగఁడు
పోటుమానిసి } శూరుఁడు-షుజా.

పోట్లాట-సంగరము-లఢై.

పోతపాత్రిక-ఓడ-జహాజ్.

పోతము { పిల్ల-బచ్చా. ఓడ-జహాజ్. వస్త్రము-కప్డా.

పోతరము { మదము-మస్తి. గర్వము-గురూరీ.

పోతవాహుఁడు-ఓడనడుపువాఁడు-జహాజ్‌రాః.

పోతిక, పోత్రము } వస్త్రము-కప్డా

పోత్రి { పంది-సువ్వర్. దున్నపోఁతు-ఖుల్గా.

పోపు-గడ్డి-ఘూఁస్.

పోబడి-జోడ-పతా.

పోరచి-వ్యర్థము-ఫుజూల్.

పోరాట, పోరాటము { తగు-ఝగ్డా. యుద్ధము-లఢై.

పోరామి-మైత్రి-దోస్తి.

పోరితము-కొట్లాట-ఝగ్డా.

పోరు-సమరము-లఢై.

పోఱఁడు-చిన్నవాఁడు-లడ్కా.

పోఱి-బాలిక-లడ్కీ.

పోఱివాఁడు-చిన్నవాఁడు-లడ్కా.

పోలిక, పోలికి } సామ్యము-మిసాల్.

పోలుగ-పోల్కపిట్ట-హార్యల్.

పోలుపొందు-సమాచారము-కైఫియత్.

పోలూకుఁడు-పరిచారకుఁడు-నౌకర్.

పోషకుఁడు<br>పోష్ట } రక్షకుఁడు-హాఫిజ్.

పోసనము { పాలుపీర్. / కాంతి-రౌనక్.

పౌఁజు<br>పవుఁజు } సేన-జమీఅత్.

పౌగండుఁడు-చిన్నవాఁడు-లడ్కా.

పౌతవము-త్రాసు-తరాజూ.

పౌత్రి-మనమరాలు-పోతీ.

పౌత్రుఁడు-మనమఁడు-పోతా.

పౌలు-పగలు-దిన్.

పౌళి-గుగ్గిళ్లు-ఘుంగిన్యా.

ప్రకంపనుఁడు-పెనుగాలి-తూఫాన్.

ప్రకటన<br>ప్రకటనము } ప్రకటించుట-ముష్తహార్.

ప్రకటము-ప్రసిద్ధము-మష్హూర్.

ప్రకర్షము { అతిశయము-జియాదా. / మేలు-నేకీ.

ప్రకారము-చొప్పున-మాఫిక్.

ప్రకాశము-{ వెలుఁగు-రోష్నీ. / ఎండ-ధూప్.

ప్రకీర్ణకము-గుఱ్ఱము-ఘోడా.

ప్రకృతి-స్వభావము-చాల్.

ప్రక్క-పార్శ్వము-బాజూ.

ప్రక్రమము-ఆరంభము-షురూ.

ప్రక్రియ { అధికారము-ఎఖ్తియార్.
పద్ధతి-తరీకా.

ప్రఖరము { ప్రఖర-జీన్.
గాడిద-గథా.
కుక్క-కుత్తా.

ప్రగాఢము-మిక్కిలి-జియాదా.

ప్రగుణము-సరియైనది-సహీ.

ప్రగ్రహము-చెఱ-కైద్.

ప్రగ్రీవము { చెంబు-లోటా.
మెడ-గర్దన్.

ప్రఘణము-బిందె-ఘడా.

ప్రచండము-వాడిమిగలది-తేజ్.

ప్రచారము { నడవడి-చాల్.
సంచారము-సఫర్.

ప్రచురము { మిక్కిలి-జియాదా.
ప్రసిద్ధము-మష్హూర్.

ప్రఛర్దిక-వాంతి-ఖై.

ప్రచ్ఛదపటము-గవుసెన-గలేఫ్.

ప్రచ్ఛన్నము-తెలియనటుల-పోషీదా.

ప్రజ { జనము-లోగ్.
సంతతి-ఔలాద్.

ప్రజాత-బాలెంత-జేచా.

ప్రజ్ఞ—బుద్ధి—అకల్.

ప్రజ్ఞానము { బుద్ధి—అకల్. / గుఱుతు—నిషాణ్. }

ప్రజ్ఞుఁడు—పండితుఁడు—ఆలిం.

ప్రణయము { మైత్రి—దోస్తీ. / వినయము—తహజీబ్. / ప్రేమము——మొహబ్బత్. / పరిచయము—పఛానత్. }

ప్రణాళి—జలదారి—మోరీ.

ప్రణిధి—వేగులవాఁడు—జాసోస్.

ప్రతతి—తీఁగ—ఖేల్.

ప్రతనము—ప్రాఁత—పురానా.

ప్రతానము { తీఁగ—బేల్. / మొలక—మోడ్. }

ప్రతాపము—వేఁడిమి—గర్మీ.

ప్రతారకుఁడు—మోసకాఁడు—దగాబాజ్.

ప్రతారణము—మోసము—దగా.

ప్రతి { విరోధి—మొఖాలిఫ్. / మాఱు—సానీ. / భాగము—హిస్సా. }

ప్రతికూలము—వ్యతిరేకము—మొఖాలెఫత్,

ప్రతిఘము { కోపము—గుస్సా. / పగ—దుష్మని. / మూర్ఛ—బేహోషీ. }

ప్రతిజ్ఞ { ఒక కార్యము చేసెదనని శపథము చేయుట—షర్తు. / అంగీకారము—రెజామంది. }

ప్రతిజ్ఞానము–అంగీకారము–రజామందీ.

ప్రతిదారణము–సమరము–లఢాై.

ప్రతిదినము–ప్రత్యహము–హర్రోజు.

ప్రతిద్వంది–శత్రువు–దుష్మన్.

ప్రతిన–ప్రతిజ్ఞ–షర్తు.

ప్రతినివేశము–అక్కఱ–షౌక్.

ప్రతిపక్షి }
ప్రతిపక్షుడు } శత్రువు–దుష్మన్.

ప్రతిపత్తి { గౌరవము–ఇజ్జత్.
తెలివి–అకల్.
నమ్మకము–భరోసా.
ప్రవేశము–దఖల్.

ప్రతిపత్తు–బుద్ధి–అకల్.

ప్రతిపాదనము–ఈవి–సఖావత్.

ప్రతిపాలకుడు–రక్షకుడు–హాఫిజ్.

ప్రతిపాలనము–రక్షణము–హిఫాజత్.

ప్రతిబంధము–అడ్డగింత–మనా.

ప్రతిభ–కాంతి–రౌనక్.

ప్రతిభటుడు–శత్రువు–దుష్మన్.

ప్రతియోగము–విరోధము–మొఖాలెఫత్.

ప్రతియోగి–శత్రువు–దుష్మన్.

ప్రతియోధి–దొంగ–చోర్.

ప్రతివచనము–ప్రత్యుత్తరము–జవాబ్.

ప్రతివసథము–గ్రామము–దేహ్.

ప్రతివారము–ప్రతిదినము–హర్రోజు.

ప్రతివాసి-ఇరుగుపొరుగుననుండెడివాఁడు-పడోస్.

ప్రతిశీర్షకము-కుదున-రెహాన్.

ప్రతిశ్యాయము-పడిశెము-జోకాం.

ప్రతిశ్రయము-ఇల్లు-మకాన్.

ప్రతిశ్రవము-అంగీకారము-రజామందీ.

ప్రతిషేధము
ప్రతిష్టంభము } అడ్డగింత-ముమానెఅత్

ప్రతిష్ఠ { గౌరవము-ఇజ్జత్.
చోటు-జగః.
నేల-జమీన్.
కీర్తి-నేక్నామీ.

ప్రతిసరము { కడియము-కడా.
ప్రాతఃకాలము-అలస్సుబః.

ప్రతిహారి
ప్రతిహారుఁడు } వాకిటికావలివాఁడు-దర్బాన్.

ప్రతీకము-అవయవము-అజా.

ప్రతీకారము-చికిత్స-ఇలాజ్.

ప్రతీక్షించు-ఎదురుచూచు-ఇంతెజారీ.

ప్రతీతి { ప్రసిద్ధి-మష్హూర్.
సంతోషము-ఖుషి.

ప్రతీపదర్శిని-ఆఁడుది-ఔరత్.

ప్రతీపము-ప్రతికూలము-మొఖాలెఫత్.

ప్రతీపుఁడు-పగవాఁడు-దుష్మన్.

ప్రతీరము-తీరము-కినారా.

ప్రతీహారము-ద్వారము-దర్వాజా.

ప్రతీహారి
ప్రతీహారుఁడు } ద్వారపాలకుఁడు–దర్ బాన్.

ప్రత్తి–దూది–రూయి.

ప్రత్నము–ప్రాఁత–పురానా.

ప్రత్యగ్రము–పరిశుద్ధము–పాక్.

ప్రత్యనీకుఁడు–పగవాఁడు–దుష్మన్.

ప్రత్యయము <
స్నేహము–దోస్తీ.
అవకాశము–ఫుర్సత్.
ప్రసిద్ధి–మష్హూర్.
వశము–ఇమ్కాన్.
హేతువు–వజః.
శపథము–షర్తు.
బుద్ధి–అకల్.

ప్రత్యర్థి–శత్రువు–దుష్మన్.

ప్రత్యవాయము <
పాపము–అజాబ్.
దోషము–గునః.
దుర్దశ–బద్ బఖ్తీ.

ప్రత్యహము–ప్రతిదినము–హర్రోజ్.

ప్రత్యాసక్తి–సంబంధము–తాల్లుక్.

ప్రత్యుత్తరము–మాఱుత్తరము–జవాబ్.

ప్రత్యుద్గతము–ప్రత్యుత్థానము–తాజీం.

ప్రత్యుషము
ప్రత్యూషము } ప్రాతఃకాలము–అలస్సుబః

ప్రత్యూహము <
విఘ్నము–ఖలల్.
చెఱుపు–బదీ.

ప్రత్యేకము-వేఱు-జుదా.

ప్రథ { పేరు-నాం.
స్తోత్రము-తారీఫ్.
ప్రఖ్యాతి-మష్హూర్.

ప్రథమము-మొదటిది-పహిలా.

ప్రదరము-బాణము-తీర్.

ప్రదీపము-దివ్వె-చిరాగ్.

ప్రదేశనము-కానుక-తోహఫా.

ప్రదేశము-చోటు-జగః.

ప్రద్యోతనుఁడు-సూర్యుడు-సూరిజ్.

ప్రధనము-యుద్ధము-లఢై.

ప్రధానము-బుద్ధి-అకల్.

ప్రధానుఁడు }
ప్రధాని } మంత్రి-వజీర్.

ప్రధ్వంసము-నాశము-ఫనా.

ప్రన్నఁదము }
ప్రన్నన } అందము-హుస్న్.

ప్రపితామహుఁడు-ముత్తాత-పడ్దాదా.

ప్రప్రపితామహుఁడు-తాతతండ్రి-సర్దాదా.

ప్రబర్హము-మొదటిది-పహిలా.

ప్రబోధనము-అత్తరు-ఇతర్.

ప్రబోధము { తెలివి-ఖయాల్.
జ్ఞానము-అకల్.

ప్రభ-వెలుఁగు-రోష్నీ.

ప్రభంజనుఁడు-గాలి-హవా.

ప్రభాకరుఁడు { సూర్యుఁడు—సూరిజ్.
అగ్ని—అంగార్.

ప్రభాగము—భాగము—హిస్సా.

ప్రభాతము—వేకువ—అలస్సుబః.

ప్రభావము { శక్తి—ఖుద్రత్
తేజస్సు—రౌనక్.

ప్రభువు—అధిపతి—మాలిక్.

ప్రభృతి—మొదలుకొని—వగైరా.

ప్రభృత్వము—అధికారము—ఎఖ్తియార్.

ప్రభువు—అధికారి—మాలిక్.

ప్రభూతము—అధికము—జియాదా.

ప్రమద—ఆఁడుది—ఔరత్.

ప్రమత్తత—నిర్లక్ష్యము—బేపర్వా.

ప్రమీతి—మరణము—మౌత్.

ప్రమేయము—సమయము—వఖ్తు.

ప్రయాసము—శ్రమము—తక్లీఫ్.

ప్రయోజనము { కార్యము—కాం.
హేతువు—వజః.
లాభము—నఫా.

ప్రరోహము—మొలక—మోడ్.

ప్రలంభము—వంచన—దగా.

ప్రల్లదము { దుర్భాషణము—బద్కలామీ.
దుష్కృతము—గునః

ప్రల్లదీఁడు }
ప్రల్లదుఁడు } దుష్టుఁడు—బద్నఫ్సు.

ప్రవణము—ఆసక్తి—ఖాహిష్.

ప్రవణుఁడు { సమర్థుఁడు—ముఖ్తదర్. / ఆసక్తుఁడు—ఖాహిష్మంద్.

ప్రవయుఁడు—వృద్ధుఁడు—బూఢా.

ప్రవర / ప్రవరము } కులము—జాత్.

ప్రవర్తన—నడత—చాల్.

ప్రవహము—మహావాయువు—తూఫాన్.

ప్రవాళము—పగడము—మూంగా.

ప్రవిధారణము—యుద్ధము—లడై.

ప్రవేష్టము—చేయి—హాత్.

ప్రవ్యక్తము—స్పష్టము—ముఫస్సిల్.

ప్రవృత్తి { నడక—చాల్. / వృత్తాంతము—కైఫియత్.

ప్రశస్తి—ప్రసిద్ధి—మష్హూర్.

ప్రశ్నము—ప్రశ్న—సవాల్.

ప్రష్ఠ—అడుగువాఁడు—సాయల్.

ప్రసంగము { సంభాషణ—గుఫ్తగూ. / సంబంధము—తాల్లుక్. / ప్రస్తావము—జికర్. / వాదము—బహస్.

ప్రసక్తి { ప్రస్తావము—జికర్. / ప్రసంగము—గుఫ్తగూ.

ప్రసభము—బలాత్కారము—జబర్.

ప్రసరము—వేగము—తేజీ.

ప్రసవము { పండు–ఫల్.
పుష్పము–ఫూల్.

ప్రసవ్యము { అనుకూలము–ఇత్తెఫాక్.
ప్రతికూలము–నిఫాక్.

ప్రసాదనము–అన్నము–ఖానా.

ప్రసాదము–అనుగ్రహము–మెహర్‌బానీ.

ప్రసాధని–దువ్వెన–కంగీ.

ప్రసితి–నిర్బంధము–మజ్‌బూరీ.

ప్రసితుఁడు–ఆసక్తిగలవాఁడు–ఖాహిష్‌మంద్.

ప్రసువు { ఆఁడుగుఱ్ఱము–ఘోడీ.
తల్లి–మా.

ప్రసూత–బాలెంత–జేచా.

ప్రసూతము–పువ్వు–ఫూల్.

ప్రసూతిక–బాలెంత–జేచా.

ప్రసూనము { పువ్వు–ఫూల్.
పండు–ఫల్.

ప్రస్తరము { ఱాయి–పథ్థర్.
రత్నము–హీరా.

ప్రస్తవము–విషయము–అమర్.

ప్రస్థానము–పయనము–సఫర్.

ప్రస్రవణము–చెమట–పసీనా.

ప్రస్రావము–మూత్రము–పేషాబ్.

ప్రస్ఫోటనము { దెబ్బ–మార్.
చేట–సూప్.

ప్రహరణము–ఆయుధము–హాత్‌యార్.

ప్రహారము { దెబ్బ—మార్.
జోబు—ఖత్.

ప్రహరి—ప్రాకారము—ఫసీల్.

ప్రహసనము—హాస్యము—ఠట్టా.

ప్రహారము—దెబ్బ—మార్.

ప్రహి—కూపము—కువ్వాం.

ప్రహ్లాదము } సంతోషము—ఖుషీ.
ప్రహ్లాత్తి

అపాయము—హాదెసా.
ప్రళయము < మృత్యువు—చావు
మూర్ఛ—బేహోషీ.

ప్రాంతము { తీరము—కినారా.
సమీపము—కరీబ్.

ప్రాంతరము { అరణ్యము—జంగల్.
పొలిమేర—సర్హద్.

పురాతనము—పురానా.
ప్రాంత < భృత్యుడు—నౌకర్.
వస్త్రము—కప్డా.

ప్రాకటము—ప్రసిద్ధము—మష్హూర్.

ప్రాకారము—చుట్టుగోడ—ఫసీల్.

ప్రాక్తనము—ప్రాత—పురానా.

ప్రాగారము—ఇల్లు—మకాన్.

ప్రాగ్భారము—మిక్కిలి—జేయాదా.

ప్రాగ్రము—చివర—ఆఖర్.

ప్రాగ్రసరుడు—ముందునడచువాడు—పేష్రౌ.

ప్రాచీనతిలకుడు—చంద్రుడు—చాంద్.

ప్రాజకుఁడు—బండిఁదోలువాఁడు—గాడీబాన్.

ప్రాజాపత్యము—అధికారము—ఎఖ్తియార్.

ప్రాజితను—సారథి—గాడీబాన్.

ప్రాజ్ఞ { తెలివిగలయాఁడుది—ఆకిలా. / బుద్ధి—అకల్.

ప్రాజ్ఞుఁడు—పండితుఁడు—ఆలిం.

ప్రాజ్యము—మిక్కిలి—బహుత్.

ప్రాడ్వివాకుఁడు—తగవులమారి—తంటాబాజ్.

ప్రాణము—గాలి—హావా.

ప్రాణేశుఁడు—భర్త—షౌహర్.

ప్రాతికూల్యము—ప్రతికూలము—మొఖాలెఫత్.

ప్రాదేశనము—త్యాగము—సఖావత్.

ప్రాధాన్యము—ప్రధానత్వము—మొకద్దం.

ప్రావణికుఁడు—వర్తకుఁడు—తాజర్.

ప్రాపు { ఆశ్రయము—జేరెసాయా. / రక్షణము—హిఫాజేత్.

ప్రాప్తరూపుఁడు { చేకొనివాఁడు—హసీన్. / తెలిసినవాఁడు—దానా.

ప్రాప్తి—లాభము—నఫా.

ప్రాబల్యము—బలిష్టము—జోర్.

ప్రాభవము—ప్రభుత్వము—హుకూమత్.

ప్రాభృతము—కానుక—తొహఫా.

ప్రామాణికుఁడు—నిజమాడువాఁడు—రాస్తుగో.

ప్రామాణ్యము { సాక్ష్యము—గవాహీ. / నిదర్శనము—తమ్శీల్.

ప్రామిడి—మోసము—దగా.

ప్రాయము { వయస్సు-ఉమర్.
చావు-మాత్.

ప్రాయిఁడి-భాగ్యహీనము-బద్ బఖ్తీ.

ప్రాయేటు-సముద్రము-దర్యా.

ప్రారంభము { ఆరంభము-షురూ
ప్రయత్నము-తద్ బీర్.

ప్రార్థకుఁడు-అడుగువాఁడు-సాయల్.

ప్రాలు-బియ్యము-చావల్.

ప్రాలుమాలిక-సోమరితనము-సుస్తీ.

ప్రావ { పద్ధతి-తరీకా.
దోషము-గునః.

ప్రావారము-గొంగడి-కమ్మల్.

ప్రావీణ్యము-చాతుర్యము-చాల[illegible].

ప్రావృషిజము-కప్ప-మేండుక్.

ప్రాశనీయము-ఆహారము-గజా.

ప్రాసము-ఈఁటె-బర్చీ.

ప్రాసాదము-నగరు-మహార్.

ప్రియత-మైత్రి-దోస్తీ.

ప్రియము { సంతోషము-ఖుషీ.
ఇష్టము-ఖాహిష్.
నెయ్యము-దోస్తీ.

ప్రియుఁడు-భర్త-షౌహర్.

ప్రియురాలు-భార్య-జోరూ.

ప్రీతి { సంతసము-ఖుషీ.
సుఖము-ఆరాం.
ప్రియము-మొహబ్బత్.
స్నేహము-దోస్తీ.

ప్రతిదత్తము—స్త్రీధనము—స్త్రీధన్.

ప్రువ్వు—పురువు—కీడా.

ప్రెగడ / ప్రెగ్గడ } మంత్రి—వజీర్.

ప్రేక్ష—బుద్ధి—అకల్.

ప్రేక్షణము—కన్ను—ఆంఖ్.

ప్రేతము—పీనుఁగు—లాష్.

ప్రేతవనము—స్మశానము—ఖబ్రస్తాన్.

ప్రేపు—వేకువ—అలస్సుబః.

ప్రేమ / ప్రేమము } స్నేహము—దోస్తీ. దయ—మెహర్బానీ.

ప్రేము—బెత్తము—బేద్.

ప్రేముడి—స్నేహము—దోస్తీ.

ప్రేయసుఁడు—ప్రియుఁడు—దోస్తు.

ప్రేరణము / ప్రేరణ } ప్రేరేపణ—తర్గీబ్.

ప్రేలరి—వదరుబోఁతు—బక్నేవాలా.

ప్రేలు—వదరు—బక్నా.

ప్రేవు—ప్రేఁగు—అంత్డి.

ప్రేష్యుఁడు / ప్రైష్యుఁడు } భృత్యుఁడు—నౌకర్.

ప్రొద్దు { కాలము—వఖ్తు. సూర్యుఁడు—సూరిజ్. దినము—దిన్.

ప్రొద్దుజోఁడు—చంద్రుఁడు—చాంద్.

ప్రాయ్యి—పొయ్యి—చూలః.

ప్రోడ—నిపుణుఁడు—లాయక్.

ప్రోతము—వస్త్రము—కప్డా.

ప్రోద్బలము—సాయము—మదద్.

ప్రోపరి—పోషకుఁడు—హాఫిజ్.

ప్రోపు—రక్షణము—హిఫాజత్.

ప్రోయాలు—ఇల్లాలు—జోరూ.

ప్రోలు—పట్టణము—షహర్.

ప్లవంగ
ప్లవంగము
ప్లవంగమము
ప్లవగము
} కోఁతి—బందర్. కప్ప—మేండుక్.

ప్లోతము—బట్ట—కప్డా.

ప్సానము—ఆహారము—ఖురాక్.

## ఫ

ఫక్కి—రీతి—మాఫక్.

ఫణి—పాము—సాఁప్.

ఫణితి—వాక్కు—జెబాన్.

ఫణిహారుఁడు—ద్వారపాలకుఁడు—దర్బాన్.

ఫలకము—పలక—తఖ్తీ.

ఫలము {
పండు—ఫల్.
జాజికాయ—జాయెఫల్.
లాభము—నఫా.
పర్యవసాయము—అంజాం.
}

ఫలాసనము—చిలుక—తోతా.

ఫలితము—చెట్టు—ఝాడ్.

ఫలితార్థము—సారాంశము—నతీజా.

ఫల్యము—పువ్వు—ఫూల్.

ఫాణితము { కండచక్కెర—మిశ్రీ.
పానకము—షర్బత్.

ఫాలము { నెత్తి—సర్.
నుదురు—పిషానీ.

ఫుల్లరీకము—సర్పము—సాంప్.

ఫేనిలము—రేగుబండు—బేర్.

ఫేరవము } నక్క—కోలా.
ఫేరువు }

ఫ్యానము—ఆహారము—ఖురాక్.

## బ

బంక { లుబ్ధత్వము—బొఖాలత్.
జిగట—గోంద్.

బంకముచ్చు—లోభి—బఖీల్.

బంకు—సందువీధి—గలీ.

బంగనబయలు—బట్టబయలు—మైదాన్.

బంగరము—బంగారము—సూనా.

బంగరు } స్వర్ణము—సూనా.
బంగరువు }

బంగల—కుంపటి—అంగేటీ.

బంగారము { బంగారు—సూనా.
శ్రేష్ఠము—ఉమ్దా.
దుర్లభము—దుష్వార్.

బంగి—గంజాయి—గాంజా.

బంటు
- సేవకుఁడు—ఖిద్మత్ గార్.
- శిష్యుఁడు—చేలా.
- శూరుఁడు—షుజా.

బండారము—ధనము—ఖజానా.

బండి
- శకటము—ఛక్డా.
- రథము—రథ్.

బంతి
- చెండు—గేంద్.
- పఙ్క్తి—సతర్.

బందన
- అడుసు-కీచడ్.
- బంక-గోంద్.

బంది
- నిర్బంధము—మజ్బూరీ.
- చెఱ—ఖైద్.

బందికాఁడు—బందిపోటుదొంగ—నకబ్ జేణ్.

బందిగము—చెరశాల-మహాబస్.

బందుగు
బందుగుఁడు } చుట్టము—సగ్గా.
బందువు

బంధకము—చెఱశాల—ఖైద్ఖానా.

బంధకి
- అంకుటాలు—ఫాహాషా.
- భోగముది—కంచ్నీ.

బంధనము
- చెఱ—ఖైద్.
- చెరశాల—మహాబస్.
- కుదువ—రెహాణ్.

బంధనాలయము—చెరశాల—మహాబస్.

బంధము
- చెఱ—ఖైద్.
- కుదువ—రెహాణ్.

బంధుఁడు-బంధువు-సగ్గా.

బంధుర-వేశ్య-కంచ్నీ.

బంధురము-పక్షి-పరింద్.

బంధువు { చుట్టము-సగ్గా.<br>మిత్రుఁడు-దోస్తు.

బంభరము-తుమ్మెద-భౌఁరా.

బకము { కొంగ-బగ్లా.<br>మోసగాఁడు-దగాబాజ్.

బకోటము-కొంగ-బగ్లా.

బక్క-చిక్కిపోయినవాఁడు-దుబ్లా.

బగ్గి-బూడిద-రాఖ్.

బచ్చెన-వర్ణము-రంగు.

బచ్చు-వైశ్యుఁడు-బన్యా.

బటువు-ఉంగరము-అంగోటీ.

బట్ట-గుడ్డ-కప్డా.

బట్టగుత్తు-సిగ్గువిడిచినవాఁడు-బేషరం.

బట్టబయలు-బయలు-మైదాన్.

బట్టికాఁడు { చిలుక-తోతా.<br>గోరువంక-మైనా.

బట్టె-కాలువ-నాలా.

బడ-పెద్ద-బడా.

బడప-ఆపద-ముశీబత్.

బడబ-ఆఁడుగుఱ్ఱము-ఘోడీ.

బడలిక { అలయిక-తకాన్.<br>శ్రమము-తక్లీఫ్.

బడి { పాఠశాల-మద్రసా. / వెంబడి-సాథ్. / స్వల్పము-థోడా.

బడిలి-రంధ్రము-సూరాఖ్.

బడుగు / బడువు } శవము-లాష్.

బత్తి-భక్తి-అఖీదా.

బత్తుడు-భక్తుడు-మోతెఖిద్.

బత్తెము-తిండికొఱకిచ్చెడిద్రవ్యము-భత్తా.

బదర-పగలు-దిన్.

బదరికము-పెట్టె-పిటారా.

బదులు-మాఱు-మావిజా.

బద్ద-తునుక-తుక్డా.

బద్దకము-ఆలశ్యము-దేర్.

బద్దు / బద్దుర } అనృతము-ఝూట్.

బద్రము-పదిలెము-ఎహతియాజ్.

బధిరుడు-చెవిటివాడు-గూంగా.

బన్నము-అవమానము-బేయిజ్జత్.

బయకాడు-గాయకుడు-గవయ్యా.

బయలు { బట్టబయలు-మైదాన్. / ఆకాశము-ఆస్మాన్.

బరవసము { ధైర్యము-హిమ్మత్. / పూనిక-ఇస్తెక్‌లాల్.

బరి { దొంగ-చోర్. / శత్రువు-దుష్మన్.

బరికాఁడు—మావటీఁడు—మహావత్.

బరిగి—శూన్యము—నఫీ.

బరుజే—గజ్జె—ఘుంగ్రూ.

బరువడి—మఱల—ఫిర్.

బరువు—భారము—బోఝ్

బర్కారము—పరిహాసము—థట్టా.

బర్హము—ఆకు—పత్తా.

బర్హి } నెమలి—మోర్.
బర్హిణము }

బర్హిశ్శుష్మ }
బర్హిష్కేశుఁడు } అగ్ని—అంగార్.
బర్హిస్సు }

బర్రె—మహిషి—భైఁస్.

బలము { సేన—జమీఅత్. / సత్తువ—తాఖత్. / అధికము—జియాదా.

బలవంతము—బలాత్కారము—జబర్.

బలహీనము—శక్తిలేమి—నాతవానీ.

బలాత్కారము—బలవంతము—జబర్.

బలాహము—నీళ్లు—పానీ.

బలిదము—బలాత్కారము—జబర్.

బలిపుష్టము }
బలిభుక్కు } కాకి—కవ్వా

బలిమి—బలాత్కారము—జబర్.

బలిముఖము }
బలీముఖము } కోఁతి—బందర్.

బలీవర్దము-ఎద్దు-బైల్.
బలుపు-పుష్టి-కువ్వత్.
బలువిడి } విధము-తరహా.
బల్విడి } అత్యంతము-జియాదా.
బలువు { అధికము-జియాదా.
బలము-తాఖత్.
బలె-వలె-మాఫక్.
బల్మి-బలిమి-జబర్.
బల్లి-గౌళి-సిప్‌లక్.
బల్లిదుఁడు-బలముగలవాఁడు-తాఖత్‌వర్.
బల్లెము-ఈఁటె-బర్ఛీ.
బవంతము { మోసము-దగా.
కపటము-కీనా.
బవరము-యుద్ధము-లఢాై.
బవిరి-గుండ్రము-గోల్.
బవిసి { భాగ్యము-దౌలత్.
గౌరవము-ఇజ్జత్.
సిగ్గు-షరం.
బస-వాసస్థానము-సుకూనత్.
బసవఁడు-ఎద్దు-బైల్.
బసుమము-భస్మము-రాఖ్.
బస్మము-మేఁకపోతు-ఛేలా.
బహుకరి-చీఁపురు-ఝూడు.
బహుప్రదుఁడు-దాఁత-సఖీ.
బహుమతి } సమ్మానము-ఇజ్జత్.
బహుమానము }

బహువిధము—అనేకతీరులు—అక్సాం.

బహువు—అధికము—జియాదా.

బహుస్వనము—పెద్దపిట్ట—ఉల్లూ.

బహుళ—ఆవు—గాయి.

బహుళము { ఆకాశము—ఆస్మాన్.
అధికము—జియాదా.

బళువు—బరువు—బోఝ్.

బాండువ—కుండ—ఘడా.

బాంధకినేయుడు—అంకుటాలికొడుకు—వలదుల్ హారాం.

బాంధవము—చుట్టరికము—సగావత్.

బాంధవుడు { చుట్టము—సగ్గా.
మిత్రుడు—దోస్తు.

బాంధవ్యము—చుట్టరికము—సగావత్.

బాగములు—వక్కలు—శుప్యారీ.

బాగు { అందము—హుస్న్.
క్షేమము—ఖైరియత్.
విధము—తరః.

బాగెము—సుకృతము—సవాబ్.

బాజు { కాంతి—రౌనక్.
చివర—ఆఖర్.

బాట—దారి—రస్తా.

బాటసారి—దోవనడచువాడు—రాఃరౌ.

బాడిగ—అద్దె—కిరాయ.

బాడె—బురద—కీచడ్.

బాధము { ప్రతిజ్ఞ—షర్తు.
అధికము—జియాదా.

బాతు
బాతువు { బాతుపిట్ట-బతఖ్.

బాద-బాధ-తక్లీఫ్.

బాదరాయణుఁడు-తిక్కవాఁడు-దివానా.

బాదామము-బాదముకాయ-బాదాం.

బాధ { విరుద్ధము-మొఖాలెఫత్.
దుఃఖము-రంజ్.

బాధకము-ఆక్షేపణ-మనా.

బానసము-వంటయిల్లు-బావర్చిఖానా.

బానసీఁడు-వంటవాఁడు-బావర్చి.

బానిసము-దాస్యము-ఖిద్మత్.

బానిసీఁడు-దాసుఁడు-ఖిద్మత్ గార్.

బాబా-గుఱ్ఱము-ఘోడా.

బాబు-తండ్రి-బాప్.

బాము-దుఃఖము-రంజ్.

బారకము-బరువు-బోఝ్.

బారాది-అధికము-జియాదా.

బారి-హింస-ఈజా.

బారు-వరుస-కతార్.

బాల-ఆఁడుది-ఔరత్.

బాలతృణము-పచ్చిగడ్డి-హర్యాలీ.

బాలిక-ఆఁడుది-ఔరత్.

బాలిశము-తలగడ-తక్యా.

బాలిశుఁడు
బాలుఁడు { పిల్లవాఁడు-బచ్చా.
మూర్ఖుఁడు-జాహిల్.

బాలెంత-ప్రసూత-జేచా.

బాలేయము-గాడిద-గధా.

బాల్యము-చిన్నతనము-బచ్పనా.

బాష్పము { కన్నీరు-ఆఁసూ.
ఇనుము-లోహా.

బాస { ప్రతిజ్ఞ-షర్తు.
భాష-జేబాఁ.
ప్రమాణము-హాలఫ్.

బాసట-సహాయము-మదద్.

బాహ-భుజము-ఖాందా.

బాహుమూలము-చేంక-బగల్.

బాహువు
బాహు } భుజము-ఖాందా.

బాహ్లికము } కుంకుమపువ్వు-జాఫ్రాఁ.
బాహ్లీకము } ఇంగువ-హింగ్.

బాళి { కాంక్ష-ఖాహిష్.
ప్రేమ-మొహబ్బత్.
మూర్ఛ-బేహోషీ.

బింకము-గర్వము-గురూరి.

బిందియ-బిందె-ఘడా.

బిందువు-చుక్క-ఖత్రా.

బికాసి-భిక్షమెత్తువాఁడు-భికారీ.

బికిరము-భిక్షము-భీక్.

బిగాది { ధూర్తుఁడు-జాహిల్.
భిక్షుకుఁడు-భికారీ.

బిగువు-గర్వము-గురూరీ.

బిగ్గర-గట్టిగా-ఘట్.

బిచ్చగాఁడు-బిక్షుకుఁడు-భికారీ.

బిచ్చము-తిరిపము-భీక్.

బిజేగు-బొంకు-హీఁలా.

బిట్టి { శీఘ్రము-జల్దీ.
అధికము-జియాదా.

బిడారము-వాసస్థానము-సుకూనత్.

బిడాలము-పిల్లి-బిల్లి.

బిడియము
బిడెము } సిగ్గు-షరం.

బిడువు-అవకాశము-ఫుర్సత్.

బిడ్డ { కొడుకు-బేటా.
కొమార్తె-బేటీ.

బిడ్డఁడు-కొడుకు-బేటా.

బిడ్డతల్లి-బాలెంద-జేచా.

బిడ్డె-బిడ్డ-లడ్కీ.

బిత్తలి-దిసమొల-నంగా.

బిద్ద
బిద్దె } నరకము-దోజేఖ్.

బిన్నె-వేగముగా-తేజ్.

బిరబిర-అతిత్వరితముగా-జల్దితర్.

బిరుదము-గౌరవచిహ్నము-ఖితాబ్.

బిరుసు-కాఠిన్యము-సఖ్తీ.

బిలబిల-అతిత్వరితముగా-జల్దితర్.

బిఆాన
బిఆీన ⟩ త్వరితముగా–జల్దీ.
బిఆీలున

బిఃఱుసు–కాఠిన్యము–స_క్తీ.

బిలము { రంధ్రము–ఛేద్.
గుహా–గార్.

బిలేశయము { పాము–సాంప్.
ఎలుక–చూహా.

బిసబిస–వేగము–తేజీ.

బి_స్త–నరకము–దోజెఖ్.

బీగము–తాలము–కుఫుల్.

బీజము { బలము–తాఖత్.
వి_త్తనము–తుఖుం.
హేతువు–వజః.

బీతు–భయము–డర్.

బీద–దరిద్రుఁడు–గరీబ్.

బీభత్సుఁడు–క్రూరుఁడు–జాలిం.

బీరము { గర్వము–గురూరీ.
పరాక్రమము–షుజాఅత్.

బీరువ–అఱ్ఱలుండెడిపొడవుపెట్టె–అల్మారీ.

బీఱు–వ్యర్థము–ఫుజూల్.

బుంగ్రడము–గుడ్లగూబ–ఉల్లూ.

బుక్కా–బుక్క–అబీర్.

బుగ్గి–బూడిద–రాఖ్.

బుచ్చి–చిన్న–ఛోటా.

బుజేము-భుజము-ఖాందా.

బుడకోడి-నీరుకోడి-ముర్గాబీ.

బుడము { మొదలు-అవ్వల్.
వేరు-జడ్.

బుడిగ-పిడత-మట్కీ.

బుడుత { చిన్న-ఛోటా.
బాలుఁడు-లడ్కా.

బుడుతఁడు-బాలుఁడు-లడ్కా.

బుద్ది { మతి-హోష్.
బుద్ధి-అకల్.

బుధుఁడు-పండితుఁడు-ఆలిం.

బుద్ధి-మతి-హోష్.

బుద్ధిహీనత-తెల్వితక్కువ-కమ్అక్లీ.

బుద్ధుఁడు-విద్వాంసుఁడు-ఆలిం.

బుభుక్షు-ఆఁకలి-భూక్.

బుభుక్షితుఁడు-ఆఁకలిగొన్నవాఁడు-భూకా.

బుయ్యారము-చెఱశాల-కైద్‌ఖానా.

బురద-అడుసు-కీచడ్.

బురుక-వామనుఁడు-గిడ్డా.

బురుడా-అసత్యము-ఝూట్.

బురుడుఁడు-మేదరవాఁడు-బుడూడ్.

బురులు-న్యూనత-కమీ.

బుఱటకొమ్ముఁ-చిమ్మనఁగ్రోవి-పిచ్‌కారీ.

బులుపు-సుఖము-ఆరాం.

బువ్వ-అన్నము-ఖానా.

బుసము } కసవు-ఘాఁస్.
బుషము }

బూక-అబద్ధము-ఝూట్.

బూచి-భూతము-షైతాఁ.

బూటకము { అసత్యము-ఝూట్.
{ వంచన-దగా.

బూటకాలమారి }
బూటకీఁడు } వంచకుఁడు-దగాబాజ్.
బూటకుఁడు }

బూతము పిశాచము-షైతాఁ.

బూది-బూడిద-రాఖ్.

బూమి-భూమి-జమీఁ.

బూమియ-వంచన-దగా.

బూరె-భక్ష్యవిశేషము-పూరీ.

బూస్యము-ధాన్యము-ధాఁ.

బృహద్భానువు-అగ్ని-అంగార్.

బృహన్మరీచము-మిరపకాయ-మిర్చీ.

బెండుమానిసి-బలహీనుఁడు-నాతవాఁ.

బెందడి-అడుసు-కీచడ్.

బెగడు }
బెగ్గలికము } భయము-డర్.

బెజ్జెము-రంధ్రము-ఛేద్.

బెట్ట-కఠినము-సఖ్తు.

బెట్టు { గౌరవము-ఇజ్జత్.
{ అతిశయము-జియాదా.

బెడఁద { బాధ—తక్లీఫ్. ఆపద—ముశీబత్. కీఁడు—బదీ. }

బెడసు—కఠినము—సఖ్తు.

బెడిద { భయంకరత్వము—ఖౌఫ్నాక్. కీఁడు—బదీ. కఠినము—సఖ్తు. }

బెత్తము—వేఁము—బేద్.

బెత్తు { గౌరవము—ఇజ్జత్. బెత్తము—బేద్. }

బెదరు—భయము—డర్.

బెబ్బులి—పులి—షేర్.

బెరసు—క్రూరము—జోలుం.

బెరికి—కొఱఁత—కమీ.

బెరుకు—భేదము—ఫరక్.

బెల్లము—గుడము—గుడ్.

బెల్లి { వంచన—దగా. వంచకుఁడు—దగాబాజ్. }

బెహారి—వర్తకుఁడు—తాజర్.

బెళగువ్వ, బెళవ } గువ్వ—ఫాఖ్తా.

బేగడ—అభ్రకము—అబ్రక్.

బేడిజేము—టక్కు—దగా.

బేడీలు—సంకెళ్లు—బేడీ.

బేల—మూఢుఁడు—అహమక్.

బేలరి—మోసకాఁడు—దగాబాజ్.

బేలు—మోసము—దగా.

బేహరము
బేహారము } వ్యాపారము—తిజారత్.

బేహరి
బేహారి
బేహారికుఁడు } వర్తకుఁడు—తాజర్.

బైడాలము
బయిడాలము } కోపము—గుస్సా.

బైలు—బయలు—మైదాన్.

బైసి <
భాగ్యము—దౌలత్.
గౌరవము—ఇజ్జత్.
కీర్తి—నేక్‌నామీ.
సిగ్గు—షరం.

బైసుక—ప్రతిజ్ఞ—షర్తు.

బొంకు—అనృతము—ఝూట్.

బొంది—శరీరము—జిసం.

బొందు—దారము—తాగా.

బొక్క—రంధ్రము—ఛేద్.

బొక్కలాఁడు—పాము—సాఁప్.

బొక్కసము—భాండాగారము—ఖజానా.

బొచ్చె—తలపుర్రె—ఖోప్రీ.

బొచ్చు—కేశము—బాల్.

బొజ్జ—కడుపు—పేట్

బొట్టము—గోఁచి—లంగోటీ.

బొట్టియ { కొడుకు - బేటా.
 కూఁతురు - బేటీ.

బొట్టియఁడు - కొడుకు - బేటా.

బొట్టె { కొడుకు - బేటా.
 కూఁతురు - బేటీ.

బొట్టెఁడు - బాలుఁడు - లడ్కా.

బొడ్డు - నాభి - నాఫ్.

బొప్పఁడు - మూఢుఁడు - జాహిల్.

బొబ్బమేకము - షర్జా.

బొమ - బొమ్మ - పుత్లా.

బొఱియ - బిలము - ఛేద్.

బొల్లి - తెల్లని - సుపేద్.

బొల్లితనము - అవమానము - బేయిజ్జత్.

బొల్లిమోరమేకము - ఎలుఁగుగొడ్డు - రీఛ్.

బొల్లు - అనృతము - ఝూట్.

బొల్లులమారి - అనృతవాది - ఝూటా.

బొసుకు - సిగ్గు - షరం.

బోఁకి - కుండ - ఘడా.

బోఁకె - ఎముక - హడ్డీ.

బోఁటి - వంటివాఁడు - తన్హా.

బోక్కాణము - బొక్కెన - డోల్.

బోగము - సుఖము - ఆరాం.

బోగముది - వేశ్య - కంచ్నీ.

బోటి - ఆఁడుది - ఔరత్.

బోటుఁదనము-ధూర్తత్వము-జహాలత్.

బోడిక { సేవకుఁడు-ఖిద్మత్ గార్. బాలకుఁడు-బచ్చా. చెలికాఁడు-దోస్తు. శిష్యుఁడు-చేలా. }

బోధ / బోధము } తెలివి-అకల్.

బోనకత్తియ / బోనకత్తె } దాసి-బాందీ.

బోనము-అన్నము-ఖానా.

బోనముకత్తె-దాసి-బాందీ.

బోము-బలాత్కారము-జేబర్, దస్తీ.

బోర-ఱొమ్ము-ఛాతీ.

బోరన-శీఘ్రముగా-జల్దీ.

బోరప్రాఁకుడు-పాము-సాఁప్.

బోరిగము-చీఁపురుకట్ట-ఝాడూ.

బోలెవాఁటు-దుర్భాగ్యుఁడు-బద్ నఫ్సు.

బ్రక్క { పేఁదవాఁడు-గరీబ్. బక్క-దుబ్లా. }

బ్రద్ద / బ్రద్దర } తునుక-తుక్డా.

బ్రాఁతి { ప్రేమ-ఉల్ఫత్. అధికము-జియాదా. దుర్లభము-కమ్ వార్. }

## భ

భంగ-అవమానము-బేయిజ్జత్.

భంగత }
భంగపాటు } అపజయము—షికస్తు.

భంగము { మానసము—దగా.
చెఱుపు—బదీ.
అవమానము—బేయిజ్జత్.
రోగము—బీమారీ.
తునుక—తుకడా.
ఓటమి—షికస్తు.
నష్టము—నుక్సాన్.
పగలు—దిన్.

భంగి { ప్రకారము—తరః.
భంగము—బేయిజ్జత్.
గంజాయి—గాంజా.

భంగురము—నశించునది—ఫానీ.

భండనము { సమరము—లడ్హై.
కవచము—జిరఃబక్తర్.

భండారము—బొక్కసము—ఖజానా.

భంబు { చుక్క—సితారా.
ఆకాశము—ఆస్మాన్.

భక్తకారుఁడు—వంటవాఁడు—బావర్చీ.

భక్తము—అన్నము—ఖానా.

భక్తి { సేవ—ఖిద్మత్.
నమ్మకము—భరోసా.
శ్రద్ధ—తవజ్జః.
స్నేహము—దోస్తీ.

భగము
- కీర్తి-నేక్‌నామీ.
- ఇచ్ఛ-ఖాహిష్.
- యత్నము-తద్‌బీర్.
- ఐశ్వర్యము-దౌలత్.
- జ్ఞానము-అకల్.
- ధర్మము-నేకీ.

భగవంతుఁడు-భగవానుఁడు-ఖుదా.

భగిని-తోఁడఁబుట్టినది-హమ్‌షీరా.

భటుఁడు-కాలిబంటు-ప్యాదా.

భట్టారకుఁడు
- రాజు-బాదుషా.
- సూర్యుఁడు-సూరిజ్.

భట్టాచారి-పండితుఁడు-ఆలిం.

భట్టిని-రాజుభార్య-రానీ.

భద్ర-శుభము-ముబారక్.

భద్రము
- శుభము-ముబారక్.
- బంగారము=సూనా.

భద్రశ్రీ-గందము-సందల్.

భద్రాకరణము=క్షౌరము-ఇస్‌లా.

భద్రాసనము-రాజుకూర్చుండెడిపీఠము-తఖ్తు.

భయంకరము-భీతిఁగల్గించునది-ఖౌఫ్‌నాక్.

భయానకము-పులి-షేర్

భరటుఁడు-కూలివాఁడు-మజ్‌దూర్.

భరణము, భరణ్యము
- కూలి-మజ్‌దూరీ.
- జీతము-తన్‌ఖా.

భరము
- అతిశయము-జియాదా.
- బరువు-బోఝ్.

భర్త { మగఁడు-షౌహర్.
ప్రభువు-మాలిక్.

భర్తీ-సంపూర్తి-పూరా.

భర్మము { బంగారు-సూనా.
జీతము-తన్ఖా.
కూలి-మజ్దూరీ.

భల్లము-బల్లెము-బర్ఛీ.

భల్లుకము-కోఁతి-బందర్.

భల్లూకము-ఎలుఁగుగొడ్డు-రీఛ్.

భవదీయము-నీది-ఆప్కా.

భవనము { ఇల్లు-మకాన్.
స్థానము-జగః.

భవాదృశుఁడు-నీవంటివాఁడు-ఆప్జైసే.

భవికము-శుభము-ముబారక్.

భవితవ్యము { శుభము-ముబారక్.
భాగ్యము-దౌలత్.

భవిష్యత్తు-కాఁగలది-ముస్తక్బిల్.

భవుకము
భవ్యము } శుభము-నేక్.

భషకము-కుక్క-కుత్తా.

భసితము-బూడిద-ఖాక్.

భస్త్రిక-సంచి-థైలీ.

భస్మకారుఁడు-చాకలవాఁడు-ధోబీ.

భస్మతూలము { మంచు-బర్ఫ్.
దుమ్ము-ధూల్.

భాండము—కుండ—ఘడా.

భాండాగారము—బొక్కసము—ఖజానా.

భాగధేయము
- భాగ్యము—దౌలత్.
- కప్పము—పేష్కష్.
- భాగము—హిస్సా.

భాగ్యము
- అదృష్టము—దౌలత్.
- సుకృతము—సవాబ్.
- ధనము—దౌలత్.
- సౌఖ్యము—ఆరాం.

భాగ్యవంతుఁడు
- ధనవంతుఁడు—తవంగర్.
- అదృష్టవంతుఁడు—నేక్ బఖ్తు.

భాటకము—బాడిగ—కిరాయ.

భాతి
- కాంతి—రౌనక్.
- విధము—తరః.

భానుఁడు
భానుమంతుఁడు
భానువు.
} సూర్యుఁడు—సూరిజ్.

భామ—ఆఁడుది—ఔరత్.

భామము—కోపము—గుస్సా.

భాముఁడు—సూర్యుఁడు—సూరిజ్.

భామిని—ఆఁడుది—ఔరత్.

భారకుఁడు—బరువుమోసెడివాఁడు—హమ్మాల్.

భారతి—వాక్కు—జబాన్.

భారము
- బరువు—బోఝ్.
- బాధ—తక్లీఫ్.

భార్గవప్రియము-వజ్రము-హీరా.

భాలము { నుదురు-పేషానీ.
ప్రకాశము-రోష్నీ.

భాలూకము-ఎలుఁగుగొడ్డు-రీచ్.

భావన-తలఁపు-ఇరాదా.

భావము { అభిప్రాయము-రాయె.
స్వభావము-చాల్.
వస్తువు-చీజ్.

భావుకము-శుభము-ముబారక్.

భావుఁడు-విద్వాంసుఁడు-ఆలిం.

భావ్యము-అవశ్యము-జరూర్.

భాష { ప్రతిజ్ఞ-షర్తు.
మాట-బాత్.

భాస్కరుఁడు { సూర్యుఁడు-సూరిజ్.
అగ్ని-అంగార్.

భిక్ష { బిచ్చము-భీక్.
కూలి-మజ్దూరీ.
సేవ-ఖిద్మత్.

భిత్తము-తునుక-తుక్డా.

భిత్తి, భిత్తిక } బుడుగు-బిజ్లీ.

భిషక్కు, భిషజుఁడు } వైద్యుఁడు-తబీబ్.

భిస్స-అన్నము-ఖానా.

భిస్సాకము-పేలాలు-ఖీలీ.

భీ-భయము-డర్.

భీకరము-భయంకరము-ఖోఫ్‌నాక్.

భీమరము-యుద్ధము-లడై.

భీరుకము-భయము-డర్.

భీషణము-భయంకరము-ఖోఫ్‌నాక్.

భుజంగభుక్కు-నెమిలి-మోర్.

భుజంగమము }
భుజంగము } పాము-సాప్.

భుజ-చేయి-హాత్.

భుజగమము }
భుజగము } పాము-సాప్.

భుజము-చేయి-హాత్.

భుజాంతరము-ఱొమ్ము-ఛాతీ.

భుజిష్య { దాసి-బాందీ.
వేశ్య-కంచ్నీ.

భుజిష్యుడు-సేవకుడు-ఖిద్మత్‌గార్.

భువనము { నీళ్ళు-పానీ.
జగము-దునియా.
ఆకాశము-ఆస్మాన్.

భువి { స్థానము-జగః.
భూమి-జమీన్.

భూకము-కాలము-వఖ్తు.

భూచక్రము-భూమి-జమీన్.

భూతాత్మము-దేహము-జిసం.

భూతి — సంపద—దౌలత్.
భూతి — భస్మము—రాఖ్.
భూతి — పుట్టుక—పైదాయష్.

భూతికము — కర్పూరము—కాఫూర్.
భూతికము — ఓమము—అజ్వాఁ.

భూతుఁడు—కొడుకు—బేటా.

భూదారము—పంది—సువ్వర్.

భూదేవి—భూమి—జమీఁ.

భూధరము—పర్వతము—పహాడ్.

భూనుతము—ప్రసిద్ధము—మష్హూర్.

భూపతి—రాజు—బాదుషా.

భూపుఁడు, భూభృత్తు—రాజు—బాదుషా.

భూభృత్తు—పర్వతము—పహాడ్.

భూమి—నేల—జమీఁ.

భూరి — బంగారు—సూనా.
భూరి — అధికము—జియాదా.

భూరుహము—చెట్టు—ఝూడ్.

భూవరుఁడు, రాజు—బాదుషా.

భూష, భూషణము—తొడవు—జేవర్.

భూషణ—స్తుతి—తారీఫ్.

భృంగిక—భ్రమరము—భౌఁరా.

భృతకుఁడు—కూలివాఁడు—మజ్దూర్.

భృతి — వెల—ఖీమత్.
భృతి — కూలి—మజ్దూరీ.

భృతిభుక్కు –<br>భృతిభుజుఁడు } కూలివాఁడు–మజ్దూర్.

భృత్య-కూలి-మజ్దూరీ.

భృత్యుఁడు–బంటు–నౌకర్.

భృశము–అధికము–జియాదా.

భేకము–కప్ప–మేండుక్.

భేటీ-దర్శనము–ములాకాత్.

భేరుండము–భయంకరము–ఖోఫ్‌నాక్.

భేలుఁడు–మూర్ఖుఁడు–జాహిల్.

భేషజము { మందు–దవా.<br>మోసము–దగా.

భైషజ్యము–మందు–దవా.

భోక్తా–గౌరవము–ఇజ్జత్.

భోగగృహము–పడకటిల్లు–ఆరామ్‌గాః.

భోగము { సుఖము–ఆరాం.<br>ధనము–దౌలత్.<br>అనుభవము–తజ్రుబా.

భోగి { పాము–సాఁప్.<br>రాజు–బాదుషా.<br>అనుభవశాలి–తజ్రుబకార్.

భోగ్యత–రుచి–లజ్జత్.

భోగ్యము { ధనము–దౌలత్.<br>ధాన్యము–ధాన్.

భోజనము<br>భోజ్యము } ఆహారము–ఖురాక్.

భౌతికము—ము త్తియము—మోతీ.

భ్రమ { పిచ్చి—జునూనీ.
తప్పు—కుసూర్.
కోరిక—ఖాహిష్.

భ్రమరకము { బొంగరము—లట్టూ.
తుమ్మెద—భౌరా.

భ్రమరము—తుమ్మెద—భౌరా.

భ్రమరి—మూర్ఛ—బేహోషీ.

భ్రాంతి—మిథ్యామతి—గలత్, ఖియాల్.

భ్రూణ—చూలాలు—హామిలా.

భ్రూణము { గర్భము—హామల్.
బిడ్డ—బచ్చా.

భ్రూవు—కనుబొమ—బహుం.

# మ

మంకు { మూర్ఖుఁడు—జాహిల్.
మొండి—జిద్దీ.

మంగలకత్తి—క్షురము—ఉస్తరా.

మంగలవాఁడు—క్షౌరకుఁడు—హజాం.

మంగలితనము—క్షౌరము—ఇస్లా.

మంగళ—శుభము—ముబారక్.

మంగళము { కుశలము—ఖైరియత్.
శుభము—ముబారక్.

మంగళుఁడు—అంగారకుఁడు—హజాం.

మంచిగంధము—శ్రీగంధము—సందల్.

మంచితనము—స్నేహము—దోస్తీ.

మంచేము—పర్యంకము—పలంగ్.

మంచు—హిమము—బరఫ్.

మంజళి—పసుపు—హాల్దీ.

మంట { జ్వాలి—ఆంచ్.
కోపము—గుస్సా.

మండనము—భూషణము—జేవర్.

మండలము { దేశము—ముల్కు.
కుక్క—కుత్తా.

మండలాగ్రము—కత్తి—తల్వార్.

మండలి { కుక్క—కుత్తా.
పాము—సాంప్.
పిల్లి—బిల్లి.
సూర్యుఁడు—సూరిజ్.

మండు నెల—వసంతఋతువు—గర్మా.

మండూకము
మండుకము } కప్ప—మేండక్.

మంతనము { ఆలోచనము—మష్విరా.
రహస్యము—రాజ్.

మంతరసాని—మంత్రసాని—దాయి.

మంతు { ప్రసిద్ధి—మష్హూర్.
మంత్రి—వజీర్.

మంతువు { తెలివి—అకల్.
అపరాధము—గునః.
మనుష్యుఁడు—ఇన్సాన్.
రాజు—బాదుషా.

మంథనము / మంథము — కవ్వము—రవీ.

మందట—సమీపము—నజ్దీక్.

మందడి—అశ్వశాల—అస్తబల్.

మందము—స్థూలము—మోటా.

మందల—మేర—హద్.

మందస / మందసము — పెట్టె—పిఠారా.

మందాకము—సిగ్గు—షరం.

మందాగ్ని—అగ్నిమాంద్యము—బద్హజ్మీ.

మంద—జనులు—లోగ్.

మందిరము
- ఇల్లు—మకాన్.
- పట్టణము—షహర్.
- సముద్రము—దర్యా.

మందు
- ఔషధము—దవా.
- దుర్లభము—దుష్వార్.
- ఉపాయము—తద్బీర్.
- విషము—జెహర్.

మందుఁడు
- మూర్ఖుఁడు—జాహిల్.
- నిర్భాగ్యుఁడు—బద్బఖ్తు.
- వ్యాధిగ్రస్తుఁడు—మరీజ్.

మందెమేలము
- పరిహాసము—ఠట్టా.
- విశ్వాసము—దోస్తీ.
- నర్మవాక్యము—షీరీన్కలాం.
- ఉపేక్ష—బేపర్వా.

మంపు { సొగసు–హుస్న్. / మత్తు–నిషా.

మకరము–మొసలి–మగర్.

మకరాలయము–సముద్రము–దర్యా.

మకరి–మొసలి–మగర్.

మకుటము–కిరీటము–తాజ్.

మకురము { అద్దము–ఆయినా. / మల్లెపువ్వు–మొగ్రా.

మకురు / మకురుతనము } మూర్ఖత్వము–జహాలత్.

మక్కు–మాలిన్యము–మైల్.

మక్కువ { ప్రేమ–ఉల్ఫత్. / కోరిక–ఖాహిష్.

మగమానికము / మగఱాయి } వజ్రము–హీరా.

మగవాఁడు { పురుషుఁడు–మర్దు. / శూరుఁడు–షుజా.

మగువ–ఆఁడుది–ఔరత్.

మగ్గరి–సాలెవాఁడు–జులాహా.

మచర్చిక–శ్రేష్ఠము–ఉమ్దా.

మచ్చిక { మోహము–మొహబ్బత్. / ఆసక్తి–ఖాహిష్.

మచ్ఛము–చేఁప–మచ్ఛీ.

మచ్చరము { ద్వేషము–దుష్మనీ. / అసూయ–హాసద్.

